# బైబిలుదర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

G. W. FOOTE & W. P. BALL

## 5. అపశ్రృతులు

*

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

*

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

# బైబిలు దర్శిని

# THE BIBLE HANDBOOK

Edited By

**G. W. FOOTE & W. P. BALL**

## 5. అపశృతులు

*

అనువాదం

పెన్మెత్స సుబ్బరాజు

*

పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం

పాలకొల్లు - 534 260

BYBILUDARSINI - APASRUTULU

*Translated by :*
PENMETSA SUBBARAJU

తొలిముద్రణ : అక్టోబరు 1986
ప్రతులు 1000

ప్రతులకు :

చార్వాక ఎంటర్ ప్రైజెస్
పెదగోపురంవద్ద
పాలకొల్లు - 534 260
ప. గోదావరిజిల్లా ఎ. పి.

రావిపూడి వెంకటాద్రి
ఎడిటర్, హేతువాది,
చీ రా ల - 523 155

వెల : **4-00**

బైబిలులో చెప్పబడిన ప్రవచనాలు, దేవుడు చేసిన వాగ్దానాలు అన్నీ నెరవేరాయనీ, పాత నిబంధన గ్రంథానికి నెరవేర్పే క్రొత్త నిబంధన గ్రంథమనీ క్రైస్తవుల వాదన. దైవ గ్రంథమైన బైబిలులో ప్రవక్తలు చెప్పిన కొన్ని ప్రవచనాలు తప్పిపోవడమేగాక, దేవుడు చేసిన వాగ్దానాలు నెరవేరలేదు. వాటిలో ముఖ్యమైనవి కొన్ని ఈ పుస్తకంలో పొందుపరచబడ్డాయి. ప్రతి సందర్భంలోనూ ఆయా విషయాన్ని తేలికగా పట్టి యిచ్చే శీర్షిక ఉంచబడింది.

ప్రచురణ :
పశ్చిమ గోదావరిజిల్లా హేతువాద సంఘం
పాలకొల్లు - 534 260

---

ముద్రణ : వాణీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి-1

# బైబిలు దర్శిని

## అపశృతులు

### (విఫల ప్రవచనాలు, నెరవేరని వాగ్దానాలు)

జ్ఞానవృక్ష ఫలం తిన్నరోజునే ఆదాము చనిపోవాలి

దేవుడైన యెహోవా- ఈ తోటలోనున్న ప్రతి వృక్షఫలములను నీవు నిరభ్యంతరముగా తినవచ్చును; అయితే మంచి చెడ్డల తెలివి నిచ్చు వృక్ష ఫలములను తినకూడదు; నీవు వాటిని తిను దినమున నిశ్చయముగా చచ్చెదవని నరుని కాజ్ఞాపించెను. ఆది 2 : 16, 17.

[జ్ఞాన వృక్ష ఫలమును 'తినుదినమున నిశ్చయముగా చచ్చెదవని' దేవుడు ఆజ్ఞాపించిన తరువాత ఆదాము, హవ్వలు తిన్నా వారు ఆ రోజున చనిపోలేదు. ఆదాము 930 సంవత్సరములు (?) బ్రతుకగా, హవ్వ అతనికి అనేకమంది సంతానాన్ని కన్నది. (ఆది 5 : 4, 5)]

పాముల ఆహారం మన్ను

దేవుడైన యెహోవా సర్పముతో నీవు దీని చేసినందున .... నీ కడుపుతో ప్రాకుచు నీవు బ్రదుకు దినములన్నియు మన్ను తిందువు. ఆది 3 : 14.

[పాములు మన్ను తినివు. చచ్చిపోయేలోగా మనం ధూళిరేణువులను తిన్నట్లే అవిగూడ తింటే తినవచ్చు. అంత మాత్రాన సర్పాలకు మన్ను ఆహారమనలేము. యెష 65 : 25 కూడ సర్పములు మన్ను తినును అంటున్నది.]

కయీను దేశదిమ్మరిగా బ్రతకాలి

యెహోవా .... నీవు (కయీను) భూమిమీద దిగులు పడుచు దేశదిమ్మరివై యుందువనెను. ఆది 4 : 9, 12.

[ఆది 4 : 16, 17 వాక్యాలు పరిశీలిస్తే కయీను దేశదిమ్మరిగా బ్రతకలేదని, ఒకచోట స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడని తెలుస్తున్నది. అతడు నోదు దేశంలో నివసించడమేగాక ఒక ఊరును నిర్మించి దానికి తన కుమారుడైన హనోకు పేరుపెట్టాడు.]

సార్వకాలికపు పంట

భూమి నిలిచియున్నంతవరకు వెదకాలమును కోతకాలమును శీతోష్ణములును వేసవి శీతాకాలములును రాత్రింబగళ్ళును ఉండక మానవు. ఆది 8 : 22.

[ఆది 41 : 56, 57 వాక్యాలు అనేక సంవత్సరములపాటు భూమి యందంతట పంటలు పండలేదని పేర్కొంటున్నవి.]

అబ్రహాముకు కనాను దేశం యివ్వబడాలి, దాన్ని అతని సంతతి వారు, యూదులు శాశ్వతంగా నిలుపుకోగలగాలి

అబ్రాము సాగిలపడియుండగా దేవుడతనితో మాటలాడి .... నీకును నీ తరువాత నీ సంతతికిని నీవు పరదేశివైయున్న దేశమును, అనగా కనానను దేశమంతటిని నిత్య స్వాస్థ్యముగా ఇచ్చి వారికి దేవుడనైయుందునని అతనితో చెప్పెను. ఆది 17 : 3, 8.

నీవు చూచుచున్న ఈ దేశమంతటిని నీకును నీ సంతానమునకును సదాకాలము ఇచ్చెదను. ఆది 13 : 15.

అబ్రాహాము, ఇస్సాకును ఇశ్రాయేలును జ్ఞాపకము చేసికొనుము. నీవు వారితో- ఆకాశ నక్షత్రముల వలె మీ సంతానము అభివృద్ధిజేసి నేను చెప్పిన ఈ సమస్త భూమిని మీ సంతానమున కిచ్చెదననియు, వారు నిరంతరము దాని హక్కుదారులగుదురని .... చెప్పితి వనెను. నిర్గ 32 : 13.

[దేవుడు వాగ్దానము చేసినరీతిగా అబ్రహామునకు ఎన్నటికీ కనాను దేశమును అప్పగించలేదు. అపొ 7 : 5 దేవుడు అబ్రాహామునకు కనాను దేశమును యివ్వలేదని ఒప్పుకొంటూ "ఆయన యిందులో అతనికి పాదము పట్టు భూమినైనను స్వాస్థ్యముగా ఇయ్యక" అని పేర్కొంటున్నది. 'యూదులు కనాను దేశమంతటిని సదాకాలము స్వాధీనపరచుకోలేదు' అన్న చారిత్రిక

సత్యం దీనివల్ల రుజువవుతున్నది. యూదులు రోమనులచేత ఓడించబడ్డారు. వారెప్పుడూ కనాను దేశాన్ని పూర్తిగా తిరిగిపొందలేదు]

## ఐగుప్తులో ఇశ్రాయేలీయుల దాస్యం 400 సంవత్సరాలు

ఆయన- నీ (అబ్రాహాము) సంతతివారు తమదికాని పరదేశమందు నివసించి ఆ దేశపు వారికి దాసులుగా నుందురు. వారు నాలుగువందల యేండ్లు వీరిని శ్రమపెట్టుదురు, ఆది 15 : 13, 14.

[చాందస బైబిలు కాలమాన ప్రకారం ఇశ్రాయేలీయులు ఐగుప్తులో 215 సంవత్సరములు మాత్రమే వున్నారు. యాకోబు క్రీస్తుకు పూర్వం 1706 లో ఐగుప్తులో ప్రవేశించాడు. మోషే ఆధ్వర్యంలో క్రీ. పూ. 1491 లో దాస్య విముక్తి జరిగింది. 215 సంవత్సరాల్లో యోసేపు క్రింద వున్న కాలం ఇశ్రాయేలీయులకు భోగభాగ్యాలతో జరిగింది. బాధల యుగం 82 సంవత్సరాలే అని డా॥ పిన్నాక్ అంటాడు. నిర్గ 12 : 40 ప్రకారం ఈ మజలీ 430 సంవత్సరాలు. కాని గల 3 : 16, 17 ప్రకారం అబ్రాహాము పిలుపు తరువాత ఈ యుగము ప్రారంభమైనది. దేవుడు చెప్పినట్లు ఐగుప్తులో దాస్యయుగం నుండి కాదు. అపొ 7 : 6 ఆ తప్పు దృక్పథాన్నే పదే పదే చెబుతుంది. మోషే లేవీకి మునిమనుమడు (నిర్గ 6 : 16-20). నాలుగు తరాలు 430 సంవత్సరాలు కావడ మనేది అసంబద్ధం. జోసెఫస్ యూదులు ఐగుప్తులో వున్నది 215 సంవత్సరాలే నంటాడు. సమరయ, సెప్తూజియంటు ప్రతులు దాని సమర్థిస్తాయి.]

## అబ్రాహాము తరువాత నాలుగవ తరంలో యూదులు ఐగుప్తునుండి తిరిగి రావాలి

నీవు క్షేమముగా నీ పితురుల యొద్దకు పోయెదవు; మంచి వృద్ధాప్యమందు పాతిపెట్టబడుదువు .... నీ నాలుగవ తరము వారు ఇక్కడికి మరల వచ్చెదరు.
ఆది 15 : 15, 16.

[ఐగుప్తు బానిసత్వము నుండి బయటపడ్డ యూదులు అబ్రాహాము నుండి నాలుగవ తరమువారు కాక ఆ తరువాత చాలా కాలానికి వచ్చారు.

అబ్రాహామునుండి లెక్కింపగా యోసేపు అతని సోదరులు నాలుగవ తరము వారవుతారు.]

యూదా రాజ్యం నైలునదినుండి యూఫ్రటీసు వరకు విస్తరించాలి.

ఆ దినమందే యెహోవా .... ఐగుప్తు నది మొదలుకొని మహానదియైన యూఫ్రటీసు నది వరకు ఈ దేశమును .... నీ సంతానమున కిచ్చియున్నానని అబ్రాముతో నిబంధన చేసెను. ఆది 5 ; 18, 21.

(ద్వితీ 1 : 7 కూడ చూడండి)

[ఇశ్రాయేలీయులు ఐగుప్తునది వరకు ఎప్పుడూ విస్తరించలేదు. యూఫ్రటీసు వరకు ఎప్పుడైనా విస్తరించారా అన్నది కూడ ప్రశ్నార్థకమే]

జాతుల మాత శారయి

మరియు దేవుడు- నీ భార్యయైన శారయి .... నేనామెను ఆశీర్వదించెదను. ఆమె జనములకు తల్లియై యుండును. ఆది 17 : 15, 16.

[శారయి సంతానంలోని ప్రజలు ఒక్క యూదులే. అనేక జనములకు తండ్రివగుదువని అబ్రాహాముకు కూడ దేవుడు వాగ్దానం చేశాడు (ఆది 17 : 4, 5). ఆ రకంగా అతడు అనేక జనములకు తండ్రి కావలసి వున్నా తన సంతానం నుండి వృద్ధిపొందిన యూదులు, ఇష్మాయేలీయులు, మిద్యానీయులు, ఎదోమీయులు అను నాలుగు జాతుల వారికి మాత్రమే తండ్రి అయ్యాడు.]

కనానుదేశం యాకోబుకు వాగ్దానం చేయబడింది.

యెహోవా దానికి పైగా నిలిచి- నేను నీ (యాకోబు) తండ్రియైన అబ్రాహాము దేవుడను ఇస్సాకు దేవుడైన యెహోవాను, నీవు పండుకొనియున్న ఈ భూమిని నీకును నీ సంతానమునకును ఇచ్చెదను. ఆది 28 : 13.

[యాకోబుకు వాగ్దానం చేయబడిన దేశం ఎప్పుడూ అతని కీయబడలేదు. అతను ఉన్న ప్రాంతం ఏనాడైనా అతని వారసుల స్వాధీనంలోకి వచ్చిందా అనే విషయం కూడా సందేహాస్పదమే.]

అబ్రాము, యాకోబు, యూదులు మానవజాతి కంతటికి ఆశీర్వాద ప్రాయులు

భూమియొక్క సమస్త వంశములు నీ యందు ఆశీర్వదించబడునని అబ్రాముతో అనెను. ఆది 12 : 3.

భూలోకములోని జనములన్నియు నీ సంతానము వలన ఆశీర్వదించబడును. ఆది 22 : 18.

(ఆది 26 : 4 కూడ చూడండి)

భూమియొక్క వంశములన్నియు నీ మూలముగాను నీ సంతానము మూలముగాను ఆశీర్వదించబడును. ఆది 28 : 14

[అబ్రాము వలనగాని యాకోబు వలనగాని వారి వారసులైన యూదులవలన గాని భూమి మీది జాతులన్నీ ఆశీర్వాదం పొందలేదు. అయితే క్రీస్తు క్రైస్తవాన్ని ప్రపంచానికి ఇవ్వడం ద్వారా ఈ ప్రవచనాన్ని నెరవేర్చాడని క్రైస్తవులంటారు (అపొ 3 : 25, 26, గల 3 : 8, 9 చూడండి). అంటే క్రైస్తవమే ఆశీర్వాదమని అర్థం. నిజానికి చరిత్రనుబట్టి అది ఒక శాపమని తేలుతుంది. వాద సౌలభ్యార్థం క్రైస్తవం ఆశీర్వాదమేనని అంగీకరించినా ఆ ప్రవచనం నెరవేరనేలేదు. భూమిమీద ఎక్కువ భాగం చైనీయులు, హిందువులు, యూదులు కూడ క్రీస్తుమీద నమ్మకంలేనివారే. క్రీస్తు ఖడ్గమునేగాని సమాధానమును తీసుకొనిరాలేదని చెప్పాడు. ఆయన చెప్పిన కుటుంబ కలహాలు, జాతి మత కలహాలు, కుటుంబాలకు జాతులకు ఆశీర్వాదం తేలేదు. అధిక సంఖ్యాకులు నరకానికి పోవాలి కాబట్టి అన్ని కుటుంబాలకు, జాతులకు క్రైస్తవం ఆశీర్వాదప్రాయమనడం హాస్యాస్పదం.]

యాకోబు ఐగుప్తుకు తిరిగి వస్తాడా ?

ఆయన– నేనే దేవుడను .... నేను ఐగుప్తునకు నీతోగూడ వచ్చెదను, అంతేకాదు నేను నిన్ను నిశ్చయముగా నిన్ను తిరిగి తీసికొని వచ్చెదను. ఆది 46 : 3, 4.

[దేవుడు యాకోబుకు వాగ్దానము చేసిన ప్రకారం అతడిని ఐగుప్తునుండి మరల తీసికొని రాలేదు. ఆది 47 : 28, 29 చూడండి.]

## క్రీస్తు వచ్చేదాకా యూదా రాజ్యం స్వతంత్రంగా వుండాలి

షిలోహు వచ్చువరకు యూదా యొద్దనుండి దండము తొలగదు. అతని కాళ్ళ మధ్యనుండి రాజదండము తొలగదు. ప్రజలు అతనికి విధేయులై యుందురు. ఆది 49 : 10.

[యెరూషలేమును దావీదు జయించక ముందు షిలోహులో జాతీయ సమావేశములు జరిగేవి. పైన until shiloh come అనేది until he came to shiloh అని ఉండవలెను. (కాబట్టి పైన "షిలోహు వచ్చే వరకు" అనగా "అతడు షిలోహుకు వచ్చేవరకు" అని అర్థం చేసుకోవాలి) కాని క్రైస్తవులు షిలోహు అనే దానికి క్రీస్తు అని అర్థం చెప్పజూస్తారు అలాగైతే ప్రవచనం వట్టిపోతుంది. ఎందుకంటే యూదా రాజును నెబుకద్నెజరు బందీగా పట్టుకుపోతాడు. యెరూషలేము, దేవాలయము తగలబడిపోతాయి. యూదు ముఖ్యులంతా బాబిలోనుకు తీసుకువెళ్ళబడ్డారు. ఇదంతా క్రీస్తు పుట్టుకకు పూర్వం 588 సంవత్సరముల క్రిందట జరిగింది. క్రీస్తు, షిలోహు ఒకటి కాదు.]

## దేవుడు వాగ్దానం చేసిన భూమి విశాలమైనదిగాను సస్యశ్యామలం గాను ఉండాలి

యెహోవా యిట్లనెను- నేను ఐగుప్తులోనున్న నా ప్రజల బాధను నిశ్చయముగా చూచితిని .... ఆ దేశములో నుండి విశాలమైన మంచి దేశమునకు అనగా .... పాలు తేనెలు ప్రవహించు దేశమునకు వారిని నడిపించుటకును దిగివచ్చి యున్నాను. నిర్గ 3 : 7, 8.

[పాలస్తీనా మంచి భూమీకాదు, పెద్దదీకాదు. అందులో పాలు తేనెలు ప్రవహించడంలేదు. చరిత్ర బారుకీ అది నిస్సారమైన భూమిగానే ఉండి పోయింది. వైశాల్యంలో అది ఒక చిన్న జిల్లా అంత వుంటుంది. యూదులకు తమ మాతృభూమిమీద మమకారము వుండవచ్చు. కాని

యిలాంటి భ్రమలను వాస్తవాలుగా వాళ్ళు ఎందుకు అంగీకరించాలో అర్థంకాదు.]

మోయాబు ప్రాంతాలను క్రీస్తు (?) కొడతాడట !

నక్షత్రము యాకోబులో ఉదయించును. రాజదండము ఇశ్రాయేలులో నుండి లేచును. అది మోయాబు ప్రాంతములను కొట్టును. కలహ వీరులందరిని నాశనము చేయును. సంఖ్యా 24 : 17.

[ఇది ముఖ్యమైన ప్రవచమని క్రైస్తవులు తెలివి తక్కువగా చెబుతారు. క్రీస్తుకు రాజదండం లేదు. ఆయన మోయాబు ప్రాంతాలను కొట్టలేదు. కలహ వీరులను నాశనము చేయలేదు.

ఫీనెహాసు, అతని కుమారులు యాజకత్వము కలకాలం నిలుపుకో గలగాలి

యెహోవా మోషేకు ఈలాగు ఆజ్ఞ యిచ్చెను- యాజకుడైన అహరోను మనుమడును ఎలియాజరు కుమారుడునైన ఫీనెహాసు, వారిమధ్యను నేను ఓర్వలేని దానిని తాను ఓర్వలేకపోవుట వలన ఇశ్రాయేలీయులమీదనుండి నా కోపము మళ్ళించెను గనుక నేను ఓర్వలేక యుండియు ఇశ్రాయేలీయులను నశింపజేయలేదు. కాబట్టి నీవు అతనితో యిట్లనుము- అతనితో నేను నా సమాధాన నిబంధనను చేయు చున్నాను- అది నిత్యమైన యాజక నిబంధనగా అతనికిని అతని సంతానమునకును కలిగియుండును. సంఖ్యా 25 : 10-13.

(శాశ్వత మనబడుతున్న యాజకత్వం ఆ తరువాత అహరోను మరియొక కుమారుని వారసులకు మారింది. తరువాత ఫీనెహాసు వారసుడైన సోదాకుకు సొలొమోను తిరిగి యిప్పించెను.]

భూమి నాశనమవుతుందా లేక శాశ్వతంగా వుంటుందా ?

నీకును నీ తరువాత నీ సంతానపువారికిని .... నీ దేవుడైన యెహోవా సర్వకాలము నీ కిచ్చుచున్న దేశము. ద్వితీ 4 : 40.

(ప్రసం 1 : 4; కీర్త 104 : 5 కూడ చూడండి.)

భూమియు దానిమీదనున్న కృత్యములును కాలిపోవును. ఇవన్నియు ఇట్లు లయమైపోవును. 2 పేతు 3 : 10, 11.

[పరస్పరం విభేదిస్తున్న ఈ రెండు ప్రకటనల్లోను ఏదో ఒకటి అసత్యమై యుండాలి.]

యూదులు అప్పు పుచ్చుకోవాలేగాని అప్పు యివ్వకూడదు

అతడు నీకు అప్పిచ్చునుగాని నీవు అతనికి అప్పియ్యలేవు .... మరియు అవి చిరకాలము వరకు నీ మీదను నీ సంతానము మీదను సూచనగాను విస్మయ కారణముగాను ఉండును. ద్వితీ 28 : 44, 46.

[యూదులు ఋణదాతలకు బదులుగా ఋణగ్రస్తులయ్యేట్లయితే యిది మహత్తరమైన ప్రవచనమని క్రైస్తవులనేవారు)

నఫ్తాలి పెత్తనం యెక్కడ ?

నఫ్తాలిని గూర్చి యిట్లనెను .... నఫ్తాలి, పశ్చిమ దక్షిణ దిక్కులను స్వాధీన పరచుకొనును. ద్వితీ 33 : 23.

[నఫ్తాలి పాలస్తీనా ఉత్తర భాగంలోని కొంత భాగాన్ని స్వాధీనపరచుకున్నాడు తప్ప పశ్చిమ దక్షిణ దిక్కుల్లో ఏ ఒక్క భాగాన్ని స్వాధీనం చేసుకోలేదు.]

దావీదు రాజ్యం శాశ్వతంగా అతని వారసులు దాన్ని పాలించాలి

నేను ఏర్పరచుకొనిన వానితో నిబంధన చేసియున్నాను. నిత్యము నీ సంతానమును స్థిరపరచెదను. తరతరములకు నీ సింహాసనమును స్థాపించెదను. కీర్త 89 : 3, 4

అతని సంతానము శాశ్వతముగా వుండుననియు అతని సింహాసనము సూర్యుడున్నంతకాలము నా సన్నిధిని ఉండుననియు చంద్రుడున్నంతకాలము అది నిలుచుననియు మింటనుండు సాక్షి నమ్మకముగా ఉన్నట్లు అది స్థిరపరచబడుననియు నా పరిశుద్ధతతోడని నేను ప్రమాణము చేసితిని. దావీదుతో నేను అబద్ధమాడను. కీర్త 98 : 35-37.

నీ మట్టుకు నీ సంతానమును నీ రాజ్యమును నిత్యము స్థిరమగును, నీ సింహాసనము నిత్యము స్థిరపరచబడును. 2 సమూ 7 : 16.

ఇశ్రాయేలు వారి సింహాసనముమీద కూర్చుండు వాడొకడు దావీదున కుండక మానడు. యిర్మీ 33 : 17

[ఈ వాగ్దానాలు నెరవేరలేదు. అయితే దీన్ని క్రైస్తవులు ఇహలోక రాజ్యానికి కాకుండా పరలోక రాజ్యానికి అన్వయిస్తూ దానికి క్రీస్తురాజని చెబుతున్నారు. ఈ వ్యాఖ్యానం నిజమైనా దావీదు రాజుకు దేవుడిచ్చిన వాగ్దానం భంగమైనట్లే కదా!]

సొలొమోను సింహాసనం ఎల్లప్పుడూ స్థిరంగా ఉండాలి

అతని సింహాసనమును నేను నిత్యస్థాపన చేసెదను .... నా మందిర మందును నా రాజ్యమందును నేను నిత్యము అతని స్థిరపరచెదను, అతని సింహాసనము ఎన్నటికిని స్థిరముగా నుండును. 1 దిన 17 : 12-14.

అతని రాజ్య సింహాసనమును నేను నిత్యముగా స్థిరపరచెదను.
2 సమూ 7 : 13.

[నిత్యస్థాపన అంటే 400 యేండ్లని అర్థమా ? ఎందుకంటే ఆ రాజ్యం 400 యేండ్లకే అంతమైపోయింది. పునరుద్ధరణ పొందలేదు. రాజ్యంలో ఎక్కువ భాగం తిరుగుబాటు చేసింది. తిరిగి లొంగుబాటు కాలేదు. నిత్య స్థాపన అంటే యిదేనా ?]

ఇశ్రాయేలీయులు స్వస్థలంలో శాశ్వతంగా ఉన్నారా ?

ఇశ్రాయేలీయులను నిత్యము స్థిరపరచవలెనన్న దయాలోచన నీ దేవునికి కలిగియున్నది. 2 దిన 9 : 8.

ఇశ్రాయేలీయులను నా జనులు ఇకను కదిలింపబడకుండ తమ స్వస్థలమందు నివసించునట్లు దానియందు వారిని నాటి .... దుర్బుద్ధిగల జనులు ఇకను వారిని కష్టపెట్టక యుండునట్లుగా చేసెదను. 2 సమూ 7 : 10.

[ఇది ఇప్పటికీ నెరవేరలేదు. యూదులు ప్రపంచ వ్యాప్తంగా చెల్లాచెదురై యున్నారు.]

యోషీయా సుఖంగా మరణించాలి

నీవు (యోషీయా) నెమ్మది నొందినవాడవై సమాధికి చేర్చబడుదువు.
2 రాజు 22 : 20.

[ఈ జోస్యం నిజం కాలేదు. యోషీయా యుద్ధంలో చంపబడ్డాడు. 2 రాజు 23 : 29, 30 చూడండి.]

ఆహాజుకు యెదురుగా సిరియను సంఘటన విఫలమవుతుందని వాగ్దానం

అప్పుడు యెహోవా యెషయాతో ఈలాగు సెలవిచ్చెను- ఆహాజు నెదుర్కొనుటకు నీవు .... పోయి అతనితో ఈలాగు చెప్పుము- భద్రము సుమీ, నిమ్మళించుము; పొగరాజుచున్న ఈ రెండు కొరకంచు కొనలకు అనగా రెజీనును, సిరియనులు, రెమల్యాకుమారుడును అనువారి కోపాగ్నికి జడియకుము, నీ గుండె అవియనీయకుము. సిరియాయు, ఎఫ్రాయిమును, రెమల్యా కుమారుడును నీకు కీడు చేయవలెనని ఆలోచించుచు మనము యూదాదేశము మీదికి పోయి దాని జనులను భయపెట్టి దాని ప్రాకారములను పడగొట్టి టాబెయేలను వాని కుమారుని దానికి రాజుగా నియమించెదము రండని చెప్పుకొనిరి. అయితే ప్రభువైన యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు- ఆ మాట నిలువదు, జరుగదు.
యెష 7 ; 3-7.

[యెషయా చెప్పిన దైవ వాగ్దానాన్ని ఆరోజు రాజు నమ్మి ఉన్నట్లయితే అతను పూర్తిగా మోసపోయేవాడు. ఎందుకంటె 2 దిన 28 : 5, 6 లో యిలావుంది. "అందుచేత అతని దేవుడైన యెహోవా అతనిని ఆరాము రాజుచేతి కప్పగించెను. అరామీయులు అతని ఓడించి అతని జనులలో చాలమందిని చెరపట్టుకొని దమస్కుకు తీసికొనిపోయిరి. అతడును ఇశ్రాయేలు రాజు చేతికి అప్పగింపబడెను; ఆ రాజు అతని లెస్సగా ఓడించెను. రెమల్యా కుమారుడైన పెకహు యూదావారిలో పరాక్రమ

శాలులైన లక్ష యిరువదివేలమందిని ఒక్కనాడు హతము చేసెను."
అష్షూరు రాజు సహాయాన్ని ఆహాజు అర్థించాడు. కాని అతడు బాధపెట్టాడే
గాని సహాయము చేయలేదు. 2 దిన 28 : 20, 21 చూడండి.)]

## విశ్వశాంతి

ఆ కాలమున సీయోనులో నుండి ధర్మశాస్త్రము, యెరూషలేములో నుండి యెహోవా వాక్కు బయలు వెళ్లను .... ఆయన మధ్యవర్తియై అన్యజనులకు న్యాయము తీర్చును. అనేక జనములకు తీర్పు తీర్చును. వారు తమ ఖడ్గములను నాగటి నక్కులుగాను తమ యీటెలను మచ్చుకత్తులుగాను సాగగొట్టుదురు. జనము మీదికి ఖడ్గమెత్తక యుండును, యుద్ధము చేయ నేర్చుకొనుట ఇక మానివేయును. యెష 2 : 3, 4

[యథాతథంగా తీసుకున్నా, అలంకారంగా తీసుకున్నా ఇందులోని విషయాలేమీ నెరవేరలేదు. శాంతి ప్రేమను గురించిన ఈ ప్రవచనాలు ఆత్మ విషయంలో నెరవేరతాయని క్రైస్తవులంటారు. శాంతిని కాక ఖడ్గమును తీసుకొని వచ్చానని యేసు చెప్పడం మత రాజకీయ యుద్ధాల విషయంలో నిజమయ్యాయని అంటారు.]

## కన్య తల్లి అవుతుంది.

కాబట్టి ప్రభువుతానే యొక సూచన మీకు చూపును. ఆలకించుడి, కన్యక గర్భవతియై కుమారుని కని అతనికి ఇమ్మానుయేలను పేరుపెట్టును. కీడును విసర్జించుటకును, మేలును కోరుటకును అతనికి తెలివి వచ్చునప్పుడు అతడు పెరుగు, తేనెను తినును. కీడును విసర్జించుటకును మేలును కోరుకొనుటకును ఆ బాలునికి తెలివిరాక మునుపు నిన్ను భయపెట్టు ఆ యిద్దరు రాజుల దేశము పాడు చేయబడును. యెష 7 : 14-16.

[క్రీస్తు గురించిన ప్రవచనాల్లో యిది చాల ముఖ్యమైనదని క్రైస్తవుల వాదం. సందర్భాన్నిబట్టి చూస్తే అలా కనిపించదు. క్రీస్తు కన్యకు పుట్టలేదు. పుట్టాడని క్రైస్తవు లంటారు. అసంభవమైన దానిని రుజువు

చేయడానికి ఏవేవో అర్థాలు కనిపెట్టారు ఆ ప్రవచనం నెరవేరిందని రుజువు చెయ్యాలనుకునేవారు తప్ప క్రీస్తును ఇమ్మానుయేలు అని ఎవరూ పిలువరు. అతని పేరు యేసు. కన్య అని అనువాదం చేయబడిన మాటకు యువతి అని అర్థం. ప్రవక్త తన ప్రవచనం నెరవేరడాన్ని వర్ణించే సందర్భంలో (యెష 8 : 1-4) స్వాభావికంగానే గర్భం దాల్చినట్లు కనిపిస్తుంది. యిప్పుడు కన్యగా నున్న ఆమె మున్ముందు తల్లిగావడంలో విచిత్రమేమీలేదు.]

## యేసుక్రీస్తు ప్రభుత్వం, బిరుదులు

మనకు కుమారుడు అనుగ్రహింపబడెను. ఆయన భుజముమీద రాజ్యభార ముండును. ఆశ్చర్యకరుడు ఆలోచనకర్త బలవంతుడైనదేవుడు నిత్యుడగు తండ్రి సమాధానకర్తయగు అధిపతి అని అతనికి పేరు పెట్టబడును.

యెష 9 : 6.

[ఇది యేసుక్రీస్తు గురించిన ప్రవచనమని క్రైస్తవుల వాదం. కాని ఆయన భుజముమీద రాజ్యభారమెన్నడు లేదు. అతనిని ఎవరూ ఆశ్చర్యకరుడు, ఆలోచనకర్త అని పిలువలేదు. అతనిని ఎవరూ బలవంతుడైన దేవుడని పిలువలేదు. పాప పరిహార దేవుడిగా భావిస్తారు. అతడిని నిత్యుడగు తండ్రి అని ఎన్నడూ పిలువలేదు. అతడు నిత్యుడైన కుమారుడు. పవిత్రాత్మ యెషయాను ఆవేశించి యిటువంటి పాషండ విషయాలను బోధించమని ఎలా చెప్పిందో అర్థంకాదు. క్రీస్తును శాంతి రాకుమారుడని కీర్తిస్తారు. కాని ఆయన తానుగా చెప్పినదేమంటే శాంతి కోసం కాక ఖడ్గమును తీసుకొని వచ్చానని అంటాడు (మత్తం 10 : 34) ఈ జోస్యం మాత్రం ఫలించినది. శాంతినిగాక ఖడ్గాన్ని తీసుకు వచ్చే రాకుమారుడంటే పరస్పర విరుద్ధ ప్రవచనాలను సమర్థించడానికి వీలవుతుంది.]

## దుర్మార్గుల నాశనం, శాంతిస్థాపన

యెష్షయి మొద్దునుండి చిగురు పుట్టును, వాని వేరులనుండి అంకురము ఎదిగి ఫలించును .... తన వాగ్దండముచేత లోకమును కొట్టును. తన పెదవుల

ఊపిరిచేత దుష్టులను చంపును .... తోడేలు గొఱ్ఱెపిల్లయొద్ద వాసము చేయును. చిఱుతపులి మేకపిల్లయొద్ద పండుకొనును. దూడయు కొదమ సింహమును పెంచబడిన కోడెయు కూడుకొనగా బాలుడు వాటిని తోలును. ఆవులు ఎలుగులు కూడిమేయును. వాటి పిల్లలు ఒక్కచోటనే పండుకొనును. ఎద్దు మేయునట్లు సింహము గడ్డిమేయును. యెష 11 : 1, 4, 6, 7.

[ఈ ప్రవచనం క్రీస్తుకు సంబంధించినదని క్రైస్తవు లంటారు. గొఱ్ఱెలాగ వధ్యశాలకు వెళ్ళిన సాధువు నోటి ఊపిరితోనే దుర్మార్గులను ఎట్లు చంపగలడు ? ఆతడు విశ్వశాంతిని తీసుకొని రాలేదు. మృగాలు, జాతులు యిప్పటికీ చంపుకుంటూనే ఉన్నాయి.]

క్రీస్తు రాకడ

ఆ దినమున ప్రజలకు ధ్వజముగా నిలుచుచుండు యెష్షయి వేరు చిగురునొద్ద జనములు విచారణ చేయును .... జనములను పిలుచుటకు ఆయన యొక ధ్వజము నిలువ బెట్టును. భ్రష్టులై పోయిన ఇశ్రాయేలీయులను పోగుచేయును. భూమియొక్క నాలుగు దిగంతములనుండి చెదరిపోయిన యూదావారిని సమకూర్చును. ఎఫ్రాయిమునకున్న మత్సరము పోవును. యూదావిరోధులు నిర్మూలమగుదురు .... తూర్పు వారిని దోచుకొందురు. ఎదోమును మోయాబును ఆక్రమించుకొందురు. అమ్మోనీయులు వారికి లోబడుదురు. యెహోవా ఐగుప్తు సముద్రముయొక్క అఖాతమును నిర్మూలము చేయును. వేడిమిగల తన ఊపిరిని ఊదును. యూఫ్రటీసు నది తన చెయ్యి ఆడించును. ఏడు కాలువలుగా దాని చీలగొట్టును. పాదరక్షలు తడువకుండ మనుష్యులు దాటునట్లు దాని చేయును.

యెష 11 : 10-15

[ఇది ఇంతకు ముందటి ప్రవచనం కొనసాగింపే. యేసు పదమూలం యెష్షయి అని క్రైస్తవు లంటారు. గతించిన జాతులు తిరిగిరావు. 13 వ వాక్యంలో యూదా విరోధులు నిర్మూలమవడం 14 వ వాక్యంలో తూర్పు వారిని దోచుకోవడం అనేవి 5 నుండి 9 వ వాక్యం వరకు ప్రవచించబడ్డ శాంతికి విరుద్ధం.]

### దమస్కు పట్టణం నాశనమై పోవాలి

దమస్కును గూర్చిన దేవోక్తి - దమస్కు పట్టణము కాకపోవలసి వచ్చెను. అది పాడై దిబ్బగా నగును. యెష 17 : 1, 2.

[దమస్కు పట్టణము ఇప్పటికీ నాశనం కాలేదు సరికదా మంచి స్థితిలో వున్నది.]

### ఈజిప్టు బాధలు, నైలునది ఎండిపోవడం

ఐగుప్తును గూర్చిన దేవోక్తి .... సముద్ర జలములు ఇంకిపోవును. నదియును ఎండి పొడినేల యగును .... తలయైనను తోకయైనను కొమ్మయైనను రెల్లయినను ఐగుప్తులో పనిసాగింపు వారెవరును లేరు .... యూదా దేశము ఐగుప్తునకు భయంకరమగును. తమకు విరోధముగా సైన్యముల కధిపతియగు యెహోవా ఉద్దేశించిన దానిని బట్టి ఒకడు ప్రస్తావించిన యెడల ఐగుప్తీయులు వణుకుదురు. యెష 19 : 1, 5, 15, 17.

[ఈ జోస్యాలు నెరవేరినట్టు చరిత్ర చెప్పడం లేదు.]

### యెరూషలేము శాశ్వతంగా, క్షేమంగా ఉండాలి

నిమ్మళమైన కాపురముగాను తియ్యబడని గుడారముగాను నీ కన్నులు యెరూషలేమును చూచును. దాని మేకు లెన్నడును ఊడదీయబడవు. దాని త్రాళ్ళలో ఒక్కటియైనను తెగదు. యెష 33 : 20.

[క్రీ. పూ. 587 సం॥లో అది సంపూర్ణంగా నాశనము చేయబడక పోయి నట్లయితే ఈ ప్రవచనం నిజమయ్యేదేమో!]

### దైవమహాత్యం వల్ల పైవారు క్రిందికి, క్రిందివారు పైకి మారతారు

ప్రతిలోయను ఎత్తుచేయవలెను. ప్రతి పర్వతమును ప్రతికొండను అణచవలెను .... యెహోవా మహిమ బయలు పరచబడును. ఒకడును తప్పకుండ సర్వశరీరులు దాని చూచెదరు, ఈ లాగున జరుగునని యెహోవా సెలవిచ్చి యున్నాడు. యెష 40 : 4, 5.

[ఈ ప్రవచనం క్రీస్తుదని క్రైస్తవులంటారు. సర్వశరీరులు ఆ దివ్య ప్రకటనను చూడలేదు. దానిని గూర్చి విననైనాలేదు. ఈ ప్రవచనం చెప్పి 2,000 సంవత్సరాలైంది.]

## క్రీస్తు బహిరంగంగా మాట్లాడడా ?

అతడు కేకలు వేయడు అరువడు. తన కంఠస్వరము వీధిలో వినబడ నియ్యడు. నలిగిన రెల్లును అతను విరువడు- మకమక లాడుచున్న జనుపనార వృత్తిని ఆర్పడు....భూలోకమున న్యాయము స్థాపించు వరకు అతడు మందగిలడు నలుగుడు పడడు. యెష 42 : 2-4.

[ఈ ప్రవచనాలు క్రీస్తులో నెరవేరినవని క్రైస్తవులనుకుంటారు. కాని క్రీస్తు బిగ్గరగా అరిచాడు. బహిరంగ స్థలాలలో గొంతెత్తి మాట్లాడాడు. "నాదేవా నాదేవా నన్నెందుకు చెయ్యి విడిచితివి" అని బిగ్గరగా అరిచాడు.]

## సున్నతి పొందనివారు, అపవిత్రులు యెరూషలేములో ప్రవేశింప కూడదు

సీయోను, లెమ్ము లెమ్ము, నీ బలము ధరించికొనుము. పరిశుద్ధ పట్టణమైన యెరూషలేమా, నీ సుందర వస్త్రములను ధరించుకొనుము. ఇకమీదట సున్నతి పొందని వాడొకడైనను అపవిత్రుడొకడైనను నీ లోపలికి రాడు.

యెష 52 : 1.

[యెరూషలేము విషయములో యిది అబద్ధం. ఇకపోతే క్రైస్తవులు మరొక పరలోక యెరూషలేము గురించి మాట్లాడవచ్చు.]

## సమస్త మానవాళి దేవుని రక్షణను చూడాలి

సమస్త జనముల కన్నుల యెదుట యెహోవా తన పరిశుద్ధబాహువును బయలుపరచి యున్నాడు. భూదిగంత నివాసులందరు మన దేవుని రక్షణ చూచెదరు. యెష 52 : 10.

[క్రైస్తవుల రక్షణ ప్రణాళిక గురించి మానవజాతిలో అధిక సంఖ్యాకులకు తెలియదు. ఈ ప్రవచనం యింకా నెరవేరవలసివుంది.]

## యేసు అంద వికారంగా వుండి, వాడిపోయినట్లుండాలి

లేత మొక్కవలెను యెండిన భూమిలో మొలిచిన మొక్కవలెను అతడు ఆయన యెదుట పెరిగెను. అతనికి సురూపమైనను సొగసైనను లేదు. మన మతని చూచి, అపేక్షించునట్లుగా అతని యందు సురూపము లేదు.

యెష 53 : 2

[లూకా 2 : 40 ప్రకారం యేసుబిడ్డగా ఉన్నపుడు "జ్ఞానముతో నిండుకొనుచు ఎదిగి బలము పొందుచుండెను." లూకా 2 : 52 ప్రకారం "జ్ఞానమునందును, వయస్సునందును .... వర్ధిల్లుచుండెను." అతడు లేత మొక్కవలె వున్నట్లు కాని కురూపిగా ఉన్నట్లుగాని ఆధారం లేదు. మార్కు 12 : 37 ప్రకారం "సామాన్య జనులు అతని మాటలు సంతోషముతో వినుచుండిరి". లూకా 4 : 15 ప్రకారం "ఘనత నొంది వారి సమాజ మందిరములలో బోధించుచు వచ్చెను." యేసు కురూపం నిజమైనట్లు ఎక్కడా కనిపించదు.]

## రోగాన్ని, దుఃఖాన్ని, పాపాన్ని భరించే క్రీస్తు

నిశ్చయముగా అతడు మన రోగములను భరించెను. మన వ్యసనములను వహించెను .... అతడు పొందిన దెబ్బలచేత మనకు స్వస్థత కలుగుచున్నది.... యెహోవా మన యందరి దోషమును అతని మీద మోపెను.

(యెష 53 : 4, 5, 6.

(యేసు సిలువకు తనను అర్పించుకొన్నందువల్ల ఈ ప్రవచనం నెరవేరిందని క్రైస్తవులంటారు కాని వారి మాటలకు రుజువులేదు. ఎప్పటిలాగే మన దుఃఖాలు మనం అనుభవిస్తున్నాము. మన పాపాలకు స్వాభావికమైన శిక్షను మనం అనుభవిస్తున్నాం. ప్రపంచం మొత్తం పాపాలను క్రీస్తు భరించాడని చెప్పడం పూర్తి అబద్ధం. యిలాసే దీని ద్వారా నెరవేరినాయన్న ప్రవచనాలుకూడ అబద్ధం.]

## న్యాయమూర్తి వద్ద యేసు మౌనం

బొచ్చు కత్తిరించువాని యెదుట గొఱ్ఱె మౌనముగా నుండునట్లు ఆయన నోరు తెరువలేదు. యెష 53 : 7.

[మత్త 27 : 14 ప్రకారం ఈ ప్రవచనం నిజమైనట్లు కనిపించినా యోహా 18 : 21-23, 33-37 ప్రకారం ఈ ప్రవచనం తప్పయిపోతుంది. యెందుకంటే క్రీస్తు పిలాతు ప్రశ్నలకు, ప్రధాన యాజకుడి ప్రశ్నలకు సమాధానం చెప్పాడు)

## క్రీస్తు అన్యాయం చెయ్యాడు, కపటమెరుగడు

అతడు అన్యాయ మేమియు చేయలేదు. అతని నోట ఏ కపటమును లేదు. యెష 53 : 9.

[కొత్త నిబంధన నిజమైతే క్రీస్తు అన్యాయమైన హింసాకార్యాలు చేశాడు. యోహా 2 : 15, మార్కు 11 : 15 ల ప్రకారం "త్రాళ్ళతో కొరడాలుచేసి గొఱ్ఱెలను ఎడ్లనన్నిటిని దేవాలయములో నుండి తోలివేసి, రూకలు మార్చు వారి రూకలు చల్లి పేసి వారిబల్లలు పడద్రోసెను" క్రీస్తు మోసం చేయలేదనే ప్రవచనం కూడ అబద్ధమే. అతని మోసాలకు తప్పులకు కొన్ని ఉదాహరణలు మాత్రమే యిస్తున్నాము. దేవాలయాన్ని మూడు రోజులలో నిర్మిస్తానని యూదులతో చెప్పిన దానిని ఇంగ్లీషులో TEMPLE అంటే దేవాలయము, కణత అని రెండర్థాలున్నందువల్ల ఆ విషయం తన కణతకు సంబంధించి చెప్పానన్నాడు (యోహా 2 : 19-21). ప్రపంచాంతం, విచారణ నిమిత్తం నేను మరలి రావడం ఈ తరంలోనే జరుగుతాయని చెప్పినప్పుడు మోసమే ఉపయోగించాడు. నరకాగ్ని పేరుతో జనాన్ని భయపెట్టడం కూడ మోసమే.]

## క్రీస్తు ఆత్మనర్పించలేదు

అతడు తన్నుతానే అపరాధ పరిహారార్థ బలి చేయగా అతని సంతానము చూచును. అతడు దీర్ఘాయుష్మంతుడగును. యెష 53 ; 10.

[క్రీస్తు శరీరమేగాని ఆత్మ బలి ఈయబడలేదు. క్రీస్తుకు బిడ్డలులేరు. సిలువ వేయబడడంవల్ల ఆయన రోజులు కొనసాగలేదు. యిక్కడ ఆధ్యాత్మిక వ్యాఖ్యలు చేస్తారు. సంతానం అంటే విశ్వాసులు అని అర్థం తీస్తారు.]

యూదులకు లొంగని జాతులు నాశనమవుతాయి

నిన్ను సేవింపనొల్లని జనమైనను రాజ్యమైనను నిలువదు. అట్టి జనములు నిర్మూలము చేయబడును. యెష 60 : 12

[ఈ ప్రవచనాన్ని అబద్ధం చేస్తూ యూదులకు లొంగకుండ యిప్పటికీ జాతులు స్వతంత్రంగా వర్ధిల్లుతున్నాయి. అలాకాక యిది క్రైస్తవమతానికి సంబంధించినదైతే చైనా, ఇండియా వంటి మరికొన్ని దేశాలు క్రైస్తవ మతం లేకనే వర్ధిల్లుతున్నాయి. కాబట్టి పై ప్రవచనాలు విఫలమైనాయి.]

సూర్యకాంతి ఏడురెట్లు పెరుగుతుంది

చంద్రుని వెన్నెల సూర్యుని ప్రకాశమువలె నుండును. సూర్యుని ప్రకాశము ఏడు దినముల వెలుగు ఒక దినమున ప్రకాశించినట్లుండును.

యెష 30 : 26.

ఇకను నీ దేశమున బలాత్కారమను మాట వినబడదు. నీ సరిహద్దులలో పాడు అను మాటగాని నాశనము అనుమాటగాని వినబడదు. రక్షణయే నీకు ప్రాకారములనియు ప్రఖ్యాతియే నీ గుమ్మములనియు నీవు చెప్పుకొందువు. ఇకమీదట పగలు సూర్యుని ప్రకాశము నీకు వెలుగుగా ఉండదు. నీకు వెలుగిచ్చుటకై చంద్రుడు యికను ప్రకాశింపడు. యెహోవా నీకు నిత్యమైన వెలుగవును. నీ దేవుడు నీకు భూషణముగా ఉండును .... నీ జనులందరు నీతిమంతులై యుందురు .... దేశమును శాశ్వతముగా స్వతంత్రించుకొందురు.

యెష 60 : 18, 19, 21.

[ఇవన్నీ భ్రాంతిగస్తుని మాటలు]

క్రొత్త ఆకాశం, భూమి

ఇదిగో నేను క్రొత్త ఆకాశమును క్రొత్త భూమిని సృజించుచున్నాను. మునుపటివి మరువబడును జ్ఞాపకమునకు రావు .... అక్కడ ఇకను కొద్దిదినములే బ్రదుకు శిశువులుండరు. కాలము నిండని ముసలి వారుండరు. బాలురు నూరు సంవత్సరములు వయస్సుగలవారై చనిపోవుదురు .... తోడేళ్ళును గొఱ్ఱె పిల్లలును కలిసి మేయును. సింహము ఎద్దువలె గడ్డి తినును. సర్పమునకు మన్ను ఆహారమగును. యెష 65 : 17, 20, 25.

[ఇవన్నీ భ్రమలే]

ప్రభువు దీర్ఘశాంతుడా ? దీర్ఘకోపియా ?

నేను కృపగలవాడను గనుక నేనెల్లప్పుడు కోపించువాడను కాను.

యిర్మీ 3 : 12.

మీరు నిత్యము రగులుచుండు కోపము నాకు పుట్టించితిరి.

యిర్మీ 17 : 4.

[పరస్పర విరుద్ధంగావున్న ఈ రెండు ప్రకటనల్లోను ఏదో ఒకటి తప్పు అయివుండాలి.]

యెరూషలేము ఘనత

ఆ కాలమున- యెహోవా యొక్క సింహాసనమని యెరూషలేమునకు పేరు పెట్టెదరు. జనములన్నియు తమ దుష్టమనస్సులో పుట్టు మూర్ఖత్వము చొప్పున నడుచుకొనక యెహోవా నామమును బట్టి యెరూషలేమునకు గుంపులు గుంపులుగా కూడి వచ్చెదరు. ఈ దినములలో యూదా వంశస్థులను ఇశ్రాయేలు వంశస్థులును కలిసి ఉత్తర దేశములో నుండి ప్రయాణమై, మీ పితరులకు నేను స్వాస్థ్యముగా యిచ్చిన దేశమునకు వచ్చెదరు. యిర్మీ 3 : 17, 18.

[గతించిన పది ఇశ్రాయేలీ జాతులు అంతర్థానమయి పోయాయి కాబట్టి అవి తిరిగి యూదా జాతితో నడవగలవు అనడం అబద్ధం.]

ప్రసు యూదుల రాజగును

(3) మరియు నేను వాటిని తోలివేసిన దేశములన్నిటిలోనుండి నా గొఱ్ఱెల విశేషమును సమకూర్చి తమ దొడ్లకు వాటిని రప్పించెదను, అవి అభివృద్ధిపొంది విస్తరించును.

(4) నేను వాటి మీద కాపరులను నియమించెదను, యిక మీద అవి భయపడకుండను బెదరిపోకుండను వాటిలో ఒకటైనను తప్పిపోకుండను వీరు నా గొఱ్ఱెలను మేపెదరు. ఇదే యెహోవా వాక్కు.

(5) యెహోవా ఈలాగు ఆజ్ఞ ఇచ్చుచున్నాడు- రాబోవు దినములలో నేను దావీదునకు నీతి చిగురును పుట్టించెదను; అతడు రాజై పరిపాలనచేయును, అతడు వివేకముగా నడుచుకొనుచు కార్యము జరిగించును, భూమిమీద నీతి న్యాయములను జరిగించును.

(6) అతని దినములలో యూదా రక్షణ నొందును, ఇశ్రాయేలు నిర్భయముగా నివసించును, యెహోవా మనకు నీతియని అతనికి పేరుపెట్టుదురు.

(7) కాబట్టి రాబోవు దినములలో జనులు ఇశ్రాయేలీయులను ఐగుప్తు దేశములో నుండి రప్పించి యెహోవా జీవముతోడని ప్రమాణము చేయక

(8) ఉత్తర దేశములో నుండియు, నేను వారిని చెదరగొట్టిన దేశములన్నిటిలో నుండియు వారిని రప్పించిన యెహోవానగు నాతోడని ప్రమాణము చేతురని యెహోవా సెలవిచ్చుచున్నాడు; మరియు వారు తమ దేశములో నివసింతురు. యిర్మీ 23 : 3-8.

ఆ దినములలో ఆ కాలమందే నేను దావీదునకు నీతి చిగురును మొలిపించెదను, అతడు భూమిమీద నీతి న్యాయములను అనుసరించి జరిగించును. ఆ దినములలో యూదావారు రక్షింపబడుదురు. యెరూషలేము నివాసులు సురక్షితముగా నివసింతురు, యెహోవా మనకు నీతియని యెరూషలేమునకు పేరు పెట్టబడును.

యిర్మీ 33 : 15, 16.

[ఇందులో సందర్భాన్ని బట్టి 5, 6 వాక్యాల్లోని ప్రవచనాలు తప్పిపోయినై. యూదులు తిరిగిరావడం జరుగలేదు. క్రీస్తు నేరుగా దావీదునుండి దిగిరాలేదు. ఎందుకంటే దావీదు అతని తండ్రికాదు. అతడెన్నడూ రాజు కాలేదు. ఎన్నడూ పాలించలేదు వృద్ధి పొందలేదు. తీర్పు చెప్పలేదు. భూమిమీద న్యాయము కలిగించలేదు.]

ఐగుప్తీయులు, ఇతర జాతుల వారు పతనమయి తిరిగి లేవరు

అంతట యెహోవా చేతిలో నుండి నేను ఆ పాత్రను తీసికొని యెహోవా నన్ను పంపిన జనములన్నిటిని దాని త్రాగించితిని. నేటివలెనే పాడుగాను నిర్జనముగాను అపహాస్యాస్పదముగాను శాపాస్పదముగాను చేయుటకు యెరూషలేమునకును యూదా పట్టణములకును దాని మహారాజులకును దాని అధిపతులకును త్రాగించితిని. మరియు ఐగుప్తు రాజైన ఫరోయును అతని దాసులును అతని ప్రధానులును అతని జనులందరును .... భూమిమీదనున్న రాజ్యములన్నియు దానిలోనిది త్రాగుదురు .... నీవు వారితో యీలాగు చెప్పుము- ఇశ్రాయేలు దేవుడును సైన్యముల కధిపతియైన యెహోవా యీలాగు సెలవిచ్చుచున్నాడు- నేను మీ మీదికి పంపబోవు యుద్ధము చేత త్రాగి మత్తిల్లి కక్కుకొనిన వారివలెనే యుండి మీరు మరల లేవకుండ పడుదురు .... ఉన్నత స్థలములలో నుండి యెహోవా గర్జించుచున్నాడు, తన పరిశుద్ధాలయములో నుండి తన స్వరమును వినిపించుచున్నాడు .... భూదిగంతములనుండి గొప్ప తుఫాను బయలు వెళ్ళుచున్నది. ఆ దినమున యెహోవా చేత హతులైనవారు ఈ దేశము యొక్క ఈ దిశనుండి ఆ దిశవరకు కనబడుదురు. ఎవరును వారిని గూర్చి అంగలార్చరు, వారిని సమకూర్చరు, పాతిపెట్టరు, పెంటవలె వారి శవములు నేలమీద పడియుండును.

యిర్మీ 25 : 17-19, 26-33.

[ఐగుప్తు మిగతా ప్రపంచ రాజ్యాలు క్రిందపడనూలేదు. తిరిగి లేవకుండా వుండనూలేదు. ప్రభువు ఉన్నత స్థలమునుండి గర్జించడం ప్రపంచమంతా సంహరించబడడం జరిగిన దాఖలా చరిత్రలో లేదు.]

పరజాతులవారిని పునస్థాపించుట

చెరలో నుండిన యూదావారిని ఇశ్రాయేలు వారిని నేను రప్పించుచున్నాను, మొదటనుండి నట్లు వారిని స్థాపించుచున్నాను. యిర్మీ 33 : 7.

[ఇశ్రాయేలీ పదిజాతులను పునస్థాపించుట జరుగలేదు. యూదావారుకూడ వెనుకటి శక్తితో స్వేచ్ఛతో పునస్థాపింపబడలేదు.]

సిద్కియా ప్రశాంత మరణం

యూదా రాజైన సిద్కియా, యెహోవా మాట వినుము .... నీవు .... నెమ్మదిగానే మృతి బొందెదవు. యిర్మీ 34 ; 4, 5

[యిర్మీయా హామీ నెరవేరలేదు. యిర్మీ 52 : 10, 11 వాక్యాలు "బాబెలు రాజు సిద్కియా కుమారులను అతని కన్నులయెదుట చంపించెను. మరియు అతడు రిబ్లాలో యూదా అధిపతులనందరిని చంపించెను. బాబెలు రాజు సిద్కియా కన్నులు ఊడదీయించి రెండు సంకెళ్ళతో అతని బంధించి బాబెలుకు అతని తీసికొనిపోయి, మరణమగు వరకు చెరసాలలో అతని పెట్టించెను" అని చెబుతున్నవి. యిదేనా ప్రశాంత మరణమంటే ?]

దావీదు సింహాసనముమీద కూర్చుండుటకు యెహోయాకీముకు వారసులుండరు

అందుచేతను యూదారాజైన యెహోయాకీమును గూర్చి యెహోవా యీ మాట సెలవిచ్చుచున్నాడు- దావీదు యొక్క సింహాసనము మీద ఆసీనుడగుటకు అతనికి ఎవడును లేకపోవును. యిర్మీ 36 ; 30.

[యెహోయాకీము తరువాత అతని కుమారుడు యెహోయాకీను సింహాసన మెక్కాడు (2 రాజు 24 : 6). ఇతనినే యెకొన్యా అనికూడ అంటారు (1 దిన 3 : 16). అతనినుండే మత్తయి యేసు వంశావళిని రాబట్టాడు (మత్త 1 : 11). మత్త 1 : 12 ను 1 దిన 3 : 17 తో పోల్చిచూడండి.]

యెహోయాకీము శవానికి అవమానం

కావున యోషీయా కుమారుడగు యెహోయాకీమను యూదారాజును గూర్చి యెహోవా ఈలాగు శెలవిచ్చుచున్నాడు .... అతడు యెరూషలేము గుమ్మముల ఆవలికి ఈడువబడి పారవేయబడి గాడిద పాతిపెట్టబడురీతిగా పాతిపెట్టబడును.

యిర్మీ 22 : 18, 19.

అతని శవము పగలు ఎండపాలు రాత్రి మంచుపాలు అగును.

యిర్మీయా 36 : 30

[2 రాజు 24 : 6 ప్రకారం యెహోయాకీము అతని పితురులతో నిద్రించాడు. ఆ ప్రవచనం నెరవేరి వున్నట్లయితే యిర్మీయా తన మౌనం ద్వారా పాఠకులను తప్పుదారి పట్టించేవాడు.]

నెబుకద్నెజరు తూరును ముట్టడించి నాశనం చేయడం

ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా- తూరు పట్టణమా, నేను నీకు విరోధినైతిని, సముద్రము దాని తరంగములను పొంగజేయు రీతిగా నేను అనేక జనములను నీ మీదికి రప్పించెదను. వారు వచ్చి తూరుయొక్క ప్రాకారములను కూల్చి దాని కోటలను పడగొట్టుదురు .... అది వలలు పరచుటకు చోటగును, నేనే మాట యిచ్చితిని, యిదే ప్రభువగు యెహోవా వాక్కు అది జనములకు దోపుడు సొమ్మగును .... ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా- రారాజగు బబులోను రాజైన నెబుకద్రెజరును నేనే తూరు పట్టణము మీదికి రప్పించు చున్నాను .... బీట సందులుగల పట్టణము లోనికి సైనికులు చొరబడినట్లు అతడు నీ కోటలలో ప్రవేశించునపుడు రౌతుల యొక్కయు చక్రముల యొక్కయు రథముల ధ్వనిచేత నీ ప్రాకారములు కంపించును .... నీ సితారా నాదమికను వినబడదు నిన్ను వట్టి బండగా చేయుదును. వలలు పరచుకొనుటకు చోటగుదువు, నీ వికను కట్టబడక యుందువు. నేనే మాట ఇచ్చియున్నాను; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. యెహె 26 : 3-14

భీతికి హేతువగుదువు, నీవు బొత్తిగా నాశనమగుదువు.

యెహె 27 : 36.

[ఈ ప్రవచనంలో ఏమివున్నా నెబుకద్రెజరు తూరును పట్టుకోలేకపోయాడు, నాశనం చేయలేకపోయాడు. తరువాత 240 సంవత్సరాలకు అలెగ్జాండరు దాన్ని పట్టుకున్నాడు. ఆయన తూరును పునర్నిర్మించాడు. ఆ విషయం క్రొత్త నిబంధనలో అపో 12 : 20, లూకా 10 : 13 లలో వుంది. నెబుకద్రెజరు ముట్టడి 13 సంవత్సరాలు సాగింది. అది ద్వీపంమీద వుండడంవల్ల దానిలో చొరలేకపోయారు.]

నెబుకద్రెజరు తూరు సంపదను కొల్లగొట్టును

వారు నీ ఐశ్వర్యమును దోచుకొందురు. నీ వర్తకమును అపహరింతురు.
యెహె 26 : 12

[ఈ ప్రవచనం తప్పిపోయింది. యెహె 29 : 18 లో యెహోవాయే చెప్పినట్లు "తూరు పట్టణము మీద బాబెలు రాజైన నెబుకద్రెజరు తన సైన్యముచేత బహు ఆయాసకరమైన పని చేయించెను, వారందరి తలలు బోడివాయెను. అందరి భుజములు కొట్టుకొనిపోయెను; అయినను తూరు పట్టణము మీద అతడు చేసిన కష్టమును బట్టి అతనికైనను, అతని సైన్యమునకైనను కూలి యెంత మాత్రమును దొరకక పోయెను. ఆ నగరవాసుల ఆస్తులు ఆ ద్వీపం మీదనే వుండిపోయాయి.]

ఐగుప్తు 40 సంవత్సరముల పాటు నిర్మానుష్యంగా ఉంటుంది

నీ ముఖమును ఐగుప్తురాజైన ఫరోవైపు త్రిప్పుకొని అతని గూర్చియు ఐగుప్తు దేశమంతటిని గూర్చియు ఈ సమాచార మెత్తి ప్రవచింపుము .... ఐగుప్తు దేశము నిర్మానుష్యమై పాడుగా వుండును .... ఐగుప్తు దేశమును మిగ్దోలు మొదలుకొని సెవేనే వరకు కూషు సరిహద్దువరకు బొత్తిగా పాడుచేసి ఎడారిగా ఉంచెదను. దానిలో మనుష్యులు సంచరించరు, పశువులు తిరుగవు; నలుబది సంవత్సరములు అది నిర్నివాసముగా వుండును. నిర్మానుష్యముగానున్న దేశముల మధ్యను ఐగుప్తుదేశమును పాడగునట్టుగా చేసెదను, పాడైపోయిన పట్టణముల మధ్యను దాని పట్టణములు నలుబది సంవత్సరములు పాడైయుండును, ఐగుప్తీయులను జనములోనికి చెదరగొట్టుదును, ఆయా దేశములకు వారిని

వెళ్ళగొట్టుదును. ప్రభువైన యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు- నలువది సంవత్సరములు జరిగిన తరువాత ఐగుప్తీయులు చెదరిపోయిన జనులలో నుండి నేను వారిని సమకూర్చెదను. చెరలోనుండి వారిని తోడుకొని .... వారి స్వదేశము లోనికి వారిని మరల రప్పించెదను. యెహె 29 : 2, 9-14.

[ఈ ప్రవచనం శుద్ధ అబద్ధం. 40 సంవత్సరాలేకాదు, ఒక్కరోజైనా చరిత్రలో ఐగుప్తు నిర్మానుష్యంగా లేదు.]

యూదా, నష్టజాతులు ఒక రాజు క్రింద కలుస్తాయి

వారికీలాగు చెప్పుము. ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా- ఏయే అన్యజనులతో ఇశ్రాయేలీయులు చెదరిపోయిరో ఆయా అన్య జనులలో నుండి వారిని రక్షించి, వారు ఎచ్చటెచ్చట వున్నారో అచ్చటనుండి వారిని సమకూర్చి వారి స్వదేశములోనికి తోడుకొనివచ్చి వారికమీదట ఎన్నటికిని రెండు జనములు గాను రెండు రాజ్యములుగాను ఉండకుండునట్లు ఆ దేశములో ఇశ్రాయేలీయుల పర్వతములమీద వారిని ఏకజనముగాచేసి; వారి కందరికీ ఒక రాజునే నియమించెదను .... మీ పితురులు నివసించునట్లు నా సేవకుడైన యాకోబునకు నేనిచ్చిన దేశములో వారు నివసింతురు, వారి పిల్లలును వారి పిల్లల పిల్లలును అక్కడ నిత్యము నివసింతురు, నా సేవకుడైన దావీదు ఎల్లకాలము వారికి అధిపతియై యుండును. యెహె 37 : 21-25.

[ఇది జరగనేలేదు. మరెప్పుడైనా జరుగుతుందేమో తెలియదు.]

సర్వేజనా స్సుఖినోభవంతు

నా జనులు యికనెన్నడును సిగ్గునొందక యుందురు. తరువాత నేను సర్వజనుల మీద నా ఆత్మను కుమ్మరింతును, మీకు కుమారులును మీ కుమార్తెలును ప్రవచనములు చెప్పుదురు; మీ ముసలివారు కలలు కందురు, మీ యౌవనులు దర్శనములు చూతురు. యోవే 2 : 27, 28.

[పెంతెకోస్తు పండుగ దినాన యిది నెరవేరిందని క్రైస్తవులంటారు. కాని దేవుడెప్పుడూ అందరికీ శుభం చేకూర్చినట్లు లేదు. బాధలు పడేవారు సదా బాధలనుభవిస్తూనే వున్నారు.]

చెఱ తరువాత జాతులన్ని యెరూషలేము చేరతాయి. పరాయి వారెవరూ నగరంలో కాలిడరు. ఐగుప్తు నిర్మానుష్యమవుతుంది. యూదావారు శాశ్వత పునస్థాపన పొందుతారు.

ఆ దినములలో అనగా యూదావారిని యెరూషలేము కాపురస్థులను నేను చెరలోనుండి రప్పించు కాలమున అన్యజనులనందరిని సమకూర్చి, యెహోషాపాతులోయలోనికి నా స్వాస్థ్యమగు ఇశ్రాయేలీయులను చెదరగొట్టి, నా దేశమును తాము పంచుకొనుటను బట్టి నా జనుల పక్షమున అక్కడ నేను ఆ అన్యజనులతో వ్యాజ్యెమాడుదును .... యెహోవా సీయోనులో నుండి గర్జించుచున్నాడు .... అన్యులిక మీదట దానిలో సంచరింపకుండ యెరూషలేము పరిశుద్ధ పట్టణముగా ఉండును .... అయితే యూదా దేశములోని నివాసులు నిత్యముందురు, తరతరములకు యెరూషలేమ నివాసముగా సుండును. యోవే 3 : 1, 2, 16-21.

[యూదులు తమ మాతృభూమిని తిరిగి పొందినా పై ప్రవచనంలో చాల అంశాలు జరుగలేదు]

ఇశ్రాయేలు తిరిగి లేవకూడదు– తిరిగిలేవాలి !

కన్యకయైన ఇశ్రాయేలు కూలిపోయెను, ఆమె మరెన్నటికిని లేవదు.
అమో 5 : 2.

ఇశ్రాయేలు కన్యకా, నీవు కట్టబడునట్లు నేనికమీదట నిన్ను కట్టింతును; నీవు మరల తంబురలను వాయింతువు, సంభ్రమపడువారి నాట్యములలో కలిసెదవు.
యిర్మీ 31 : 4

[పరస్పర విరుద్ధంగా వున్న పై రెండు ప్రవచనములలో ఏదో ఒక్కటి మాత్రమే నెరవేరాలి)

అమజ్యాపై శాపం

అందుకు ఆమోసు అమజ్యాతో యిట్లనెను .... యెహోవా సెలవిచ్చునదేమనగా– నీ భార్య పట్టణమందు వేశ్యయగును, నీ కుమారులు, కుమార్తెలును ఖడ్గముచేత కూలుదురు, నీ భూమి నూలు చేత విభాగింపబడును, నీవు అపవిత్రమైన దేశమందు చత్తువు. ఆమో 7 : 14, 17.

[2 రాజు 14; 2 దిన 25 అధ్యాయాల ప్రకారం అమజ్యా పాలనలో అతని భార్య వేశ్యాత్వాన్ని గురించిగాని అతని బిడ్డల వధను గురించిగాని లేదు. అతని కుమారుడు ఉజ్జియా అతని తరువాత సింహాసన మెక్కాడు. అతను ఈషువల్ల మరణించాడుగాని కత్తిచేత చంపబడలేదు, యూదాలోని లాకీషువద్ద (యెహో 15 : 39) అమజ్యా చంపబడ్డాడు (2 రాజు 14 : 29).]

## పునస్థాపన శాశ్వతం కావాలి

నా జనులగు ఇశ్రాయేలీయులను నేను చెరలోనుండి రప్పింతును, పాడైన పట్టణములను మరల కట్టుకొని వారు కాపుర ముందురు .... నేను వారికిచ్చిన దేశములో నుండి వారు యిక పెరికివేయబడరని నీ దేవుడైన యెహోవా సెలవిచ్చుచున్నాడు. అమో 9 : 14, 15.

[చెఱనుండి తిరిగిరావడమనే ప్రవచనం నెరవేరిందికాని అది శాశ్వత పునస్థాపన అవుతుందనే భాగం అబద్ధమయి పోతుంది.]

## బేత్లెహేములో క్రీస్తు జననం గురించిన ప్రవచనం

బేత్లెహేము ఎఫ్రాతా, యూదా వారి కుటుంబములలో స్వల్పగ్రామమైనను నా కొరకు ఇశ్రాయేలీయులను ఏలబోవువాడు నీలోనుండి వచ్చును; పురాతన కాలము మొదలుకొని శాశ్వతకాలము ఆయన ప్రత్యక్షమగు చుండెను .... ఆయన సమాధానమునకు కారకుడగును, అష్షూరు మన దేశములో చొరబడి మన నగరులలో ప్రవేశింపగా వాని నెదిరించుటకు మేము ఏడుగురు గొల్లల కాపరులను ఎనమండుగురు ప్రధానులను నియమింతుము. వారు అష్షూరు దేశమును, దాని గుమ్మముల వరకు నిమ్రోదు దేశమును ఖడ్గము చేత మేపుదురు, అష్షూరీయులు మన దేశములో చొరబడి మన సరిహద్దులలో ప్రవేశించినప్పుడు ఆయన యీలాగున మనలను రక్షించును. మీకా 5 : 2, 5, 6.

[ఇది క్రీస్తుకు సంబంధించిన ప్రవచనమని అతను యూదయలో బేత్లెహేము వద్ద పుట్టిన నజరేతునుండి గలిలయకు వచ్చాడని క్రైస్తవు లంటారు. ఎఫ్రాతా కుమారుడైన బేత్లెహేము యూదా వంశీయుడుగా పేర్కొనబడింది (1 దిన 4 : 4). పై ప్రవచనాన్ని నిజం చేయాలనుకున్న మత్తయి

క్రీస్తును బేత్లెహేములో పుట్టినట్లు వర్ణించాడుగాని యూదా రాకుమారులలో బేత్లెహేము ఒకడని గమనించనేలేదు. దావీదు కూడ ఆ వంశంలోనివాడే, ఆ ప్రాంతంవాడే (1 సమూ 17 : 12, 58; లూకా 2 : 4). అంటే పై ప్రవచనంలోని ముఖ్యభాగం అసలు ప్రవచనమే కాదన్నమాట.]

సింహము గొర్రెలను చీల్చునట్లు యూదులు తమ శత్రువులను నాశనం చేస్తారు

యాకోబు సంతతిలో శేషించినవారు అన్యజనుల మధ్యను అనేక జనముల లోను అడవి మృగములలో సింహము వలెను, ఎవడును విడిపింపబడకుండ లోపలికి చొచ్చి గొర్రెల మందలను త్రొక్కి చీల్చు కొదమసింహము వలెను వుందురు. నీ హస్తము నీ విరోధుల మీద ఎత్తబడి యుండునుగాక, నీ శత్రువు లందరు నశింతురు గాక. మీకా 5 : 8, 9.

[యాకోబు సంతతివారు వారి శత్రువులను నాశనము చేయలేదు. గొర్రెల మధ్య సింహము వలె ఎన్నడు ప్రవర్తించలేదు.]

యూదులు సత్యసంధులుగా ఉంటారు

ఇశ్రాయేలీయులలో మిగిలిన వారు పాపము చేయరు, అబద్ధమాడరు, కపటములాడు నాలుక వారినోట నుండదు. జెఫ 3 : 13.

[ఈ మాటలలో ఏమైనా నిజం వుంటే గింటే అది కేవలం యూదులకు మాత్రమే చెందదు.]

మహాభూకంపం తరువాత క్రీస్తురాకడ, కడవరి మందిరము మహిమ పెరుగుట

యెహోవా సెలవిచ్చునదేమనగా- ఇక కొంతకాలము యింకొక మారు ఆకాశమును భూమిని సముద్రమును నేలను నేను కంపింపజేతును. నేను అన్య జనుల నందరిని కదిలింపగా అన్యజనులందరియొక్క యిష్ట వస్తువులు తేబడును; నేను ఈ మందిరమును మహిమతో నింపుదును; ఇదే సైన్యములకు అధిపతియగు యెహోవా వాక్కు .... ఈ కడవరి మందిరము యొక్క మహిమ మునుపటి

మందిరముయొక్క మహిమను మించునని సైన్యముల కధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. ఈ స్థలమందు నేను సమాధానము నిలుపనను గ్రహించెదను. ఇదే సైన్యములకు అధిపతియగు యెహోవా వాక్కు. హగ్గ 2 : 6-9.

[క్రీస్తు రాక ముందు మహాభూకంపం రాలేదు. కడవరి మందిరము యొక్క మహిమ మునుపటి మందిరము యొక్క మహిమను మించలేదు.]

యెరూషలేమునకు వచ్చి పండుగ ఆచరించని ప్రజలున్నచోట వర్షము కురియదు !

లోకమందుండు కుటుంబములలో సైన్యములకు అధిపతియగు యెహోవా యను రాజునకు మ్రొక్కుటకై యెరూషలేమునకు రాని వారందరిమీద వర్షము కురువకుండును. ఐగుప్తీయుల కుటుంబపువారు బయలుదేరకయు రాకయు ఉండిన యెడల వారికి వర్షము లేకపోవును, పర్ణశాల పండుగ ఆచరించుటకై రాని అన్యజనులకు తాను నియమించిన తెగులుతో యెహోవా వారిని మొత్తును. ఐగుప్తీయులను పర్ణశాల పండుగ ఆచరించుటకు రాని అన్యజనుల కందరికిని రాగల శిక్ష యిదే. ఆ దినమున గుఱ్ఱముల యొక్క కళ్ళెములమీద యెహోవాకు ప్రతిష్ఠితము అనుమాట వ్రాయబడును, యెహోవా మందిరములోనున్న పాత్రలు బలిపీఠము ఎదుటనున్న పళ్ళెములవలె ప్రతిష్ఠితములుగా ఎంచబడును.

జెక 14 ; 17, 20.

[ఈ ప్రవచనము యింతవరకు నెరవేరినట్లు చారిత్రక ఋజువు లేదు.]

క్రీస్తు రాకడకు తగు ఏర్పాట్లు చేయుటకు ఏలియా తిరిగి భూమికి వచ్చును

యెహోవా నియమించిన భయంకరమైన ఆ మహాదినము రాక మునుపు నేను ప్రవక్తయగు ఏలీయాను మీ యొద్దకు పంపుదును. నేను వచ్చి, దేశమును శపించకుండునట్లు అతడు తండ్రుల హృదయములను పిల్లల తట్టును పిల్లను హృదయములను తండ్రుల తట్టును త్రిప్పును. మలా 4 : 5, 6.

[ఏలీయా రాలేదు. యోహానే ఏలీయా అని మత్త 11 : 14 చెప్పి తప్పించు కొంటున్నది. భయంకరమైన ఆ మహాదినము రానేలేదు. యోహాను, యేసు యూదులమధ్య ఐక్యత తేలేదు సరికగా వాదిమధ్య చీలికలు తగాదాలు పెట్టారు. తనకు ముందు ఏలీయా (యోహాను) వచ్చి సమస్తమును చక్కబెడతాడని మార్కు 9 : 11-13 లలో యేసు అన్నాడు. ఇది జరుగనేలేదు.]

యేసు యూదులను వారి శత్రువులనుండి విడిపించును.

మన శత్రువుల నుండియు మనలను ద్వేషించువారందరి చేతినుండియు తప్పించి రక్షణ కలుగ జేసెను .... ఆయన మన పితురులను కరుణించుటకు తన పరిశుద్ధ నిబంధనను అనగా మన తండ్రియైన అబ్రాహాముతో తాను చేసిన ప్రమాణ మును జ్ఞాపకము చేసికొనుటకును మనము శత్రువు చేతినుండి విడిపింపబడి, మన జీవిత కాలమంతయు నిర్భయులమై, ఆయన సన్నిధిని నిర్భయముగాను నీతిగాను ఆయనను సేవింపను అనుగ్రహించుటకు ఈ రక్షణ కలుగ జేసెను.

లూకా 1 : 71-75.

[యోహానుగాని యేసుక్రీస్తుగాని ఈ ప్రవచనాన్ని నెరవేర్చలేదు. యూదులు వారి శత్రువుల చేతులనుండి విముక్తి పొందలేదు. యెరూషలేము ముట్టడి వరకు రోమనుల దాస్యం క్రిందనే వున్నారు. మెస్సీయా వచ్చి రక్షిస్తాడన్న మూఢనమ్మకం వల్ల నాశనమైపోయారు. చెల్లాచెదురై కష్టా లనుభవించారు.]

యేసు యూదుల రాజుగా సింహాసనమధిష్టించును

ప్రభువైన దేవుడు ఆయన తండ్రియైన దావీదు సింహాసనమును ఆయన కిచ్చును. ఆయన యాకోబు వంశస్థులను యుగ యుగములు ఏలును.

లూకా 1 : 32, 33.

[యేసు యెన్నడూ సింహాసన మెక్కక పోవుటవలన దీనిని పరలోక సింహాసనమని క్రైస్తవులు వక్కాణిస్తుంటారు. అయినా అదీ నెరవేరలేదు. యూదులు ఆ సువార్తను తిరస్కరిస్తారు. అంటే వారిపై ఆయన పాలన లేనట్లే.]

## సాత్వికులు భూమికి అధిపతులవుతారు

సాత్వికులు ధన్యులు. వారు భూలోకమును స్వతంత్రించుకొందురు.
మత్త 5 : 5.

[ఈ ప్రవచనం ప్రత్యేకంగా ఈ కాలంలో నెరవేరలేదని తేలుతున్నది. బలవంతులు బలహీనులను జయిస్తున్నారు. సాధు జాతులు వెనుకబడి వున్నాయి.]

## ధర్మశాస్త్రాన్ని కొట్టివేయడానికి క్రీస్తు రాలేదు

ధర్మశాస్త్రమునైనను ప్రవక్తల వచనములనైనను కొట్టివేయ వచ్చితినని తలంచవద్దు. నెరవేర్చుటకే గాని కొట్టివేయుటకు నేను రాలేదు. ఆకాశమును భూమియు గతించి పోయిననే గాని ధర్మశాస్త్రమంతయు నెరవేరువరకు దానినుండి యొక పొల్లయినను ఒక సున్నయైనను తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. కాబట్టి ఈ ఆజ్ఞలలో మిగుల అల్పమైన యొకదానినైనను మీరి, మనుష్యులకు ఆలాగున చేయ బోధించు వాడెవడో వాడు పరలోక రాజ్యములో మిగుల అల్పుడనబడును. అయితే వాటిని గైకొని బోధించువాడెవడో వాడు పరలోక రాజ్యములో గొప్పవాడనబడును. మత్త 5 : 17-19.

ధర్మశాస్త్రములో ఒక పొల్లయినను తప్పిపోవుట కంటె ఆకాశమును భూమియు గతించి పోవుట సులభము. లూకా 16 : 17.

[దీనికి విరుద్ధంగా యేసుక్రీస్తు చట్టాన్ని రద్దుచేశాడని పౌలు అంటాడు (ఎఫె 2 ; 15) చట్టం నుండి విముక్తి పొందించాడని రోమీ 7 : 6 అంటున్నది. క్రైస్తవులు ధర్మశాస్త్రానికి లోబడి లేరని రోమీ 6 : 14; 3 : 28 అంటున్నవి. గల 3 : 13 ప్రకారం క్రీస్తు వారిని ధర్మశాస్త్రము యొక్క శాపమునుండి విడిపించెను. మోషేతో సహా తనకు ముందు వచ్చినవారంతా దొంగలు, దోపిడీదారులని అన్నట్లు యోహా 10 : 8 పేర్కొంటున్నది.]

రేపటిని గూర్చి బాధపడకండి

రేపటిని గూర్చి చింతింపకుడి రేపటి దినము దాని సంగతులను గూర్చి చింతించును. మత్త 6 ; 34.

[రేపటి సంగతిని గూర్చి ముందుగానే యోచించకపోతే బాధ, పస్తులు తప్పవు.]

కోరుకున్నవన్నీ యివ్వబడును

అడుగుడి మీ కియ్యబడును. వెదుకుడి మీకు దొరకును, తట్టుడి మీకు తీయబడును: అడుగు ప్రతివాడును పొందును, వెదుకు వానికి దొరకును, తట్టు వానికి తీయబడును. మత్త 7 : 7, 8.

[కోట్లాదిమంది వెదుకుతున్నారుగాని దొరకడం లేదు. అడిగిన వారికి యివ్వబడుననేది పెద్ద అబద్ధం.]

విశ్వాసము సర్వశక్తి గలది

నేను చేయు క్రియలు నా యందు విశ్వాసముంచువాడును చేయును, వాటి కంటె మరి గొప్పవియు అతడు చేయునని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. యోహా 14 : 12.

యేసు- (నమ్ముట) నీవలనైతే నమ్మువానికి సమస్తమును సాధ్యమేయని అతనితో చెప్పెను. మార్కు 9 : 23.

మీకు ఆవగింజంత విశ్వాసముండిన యెడల ఈ కొండనుచూచి- ఇక్కడ నుండి అక్కడికి పొమ్మనగానే అది పోవును. మీకు అసాధ్యమైనది ఏదియు నుండదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితో అనెను. మత్త 17 : 20, 21.

అందుకు యేసు- మీరు విశ్వాసము గలిగి సందేహపడకుండిన యెడల, ఈ అంజూరపు చెట్టునకు జరిగిన దానిని చేయుట మాత్రమేకాదు, ఈ కొండను చూచి

నీవు ఎత్తబడి సముద్రములో పడవేయ బడుదువుగా కని చెప్పిన యెడల, ఆలాగున జరుగునని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. మత్త 21 : 21.

ఎవడైనను ఈ కొండనుచూచి- నీవు ఎత్తబడి సముద్రములో పడవేయ బడుమని చెప్పి, తన మనస్సులో సందేహింపక తాను చెప్పినది జరుగునని నమ్మినయెడల వాడు చెప్పినది జరుగునని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.
మార్కు 11 : 23.

ప్రభువు- మీరు ఆవగింజంత విశ్వాసము గలవారైతే ఈ కంబళి చెట్టును చూచి- నీవు వేళ్ళతోకూడ పెళ్ళగింపబడి సముద్రములో నాటబడుమని చెప్పునప్పుడు అది మీకు లోబడును. లూకా 17 : 6.

[ఇది తప్పిపోయిందని పరిశుద్ధ గ్రంథంలోనే కావలసినన్ని ఉదాహరణ లున్నాయి. మార్కు 9 : 28, 29 లో "ఆయన శిష్యులు- మేమెందుకు ఆ దెయ్యమును వెళ్ళగొట్టలేకపోతిమని ఆయన నడిగిరి. అందుకాయన ప్రార్థన వలననేగాని మరి దేనివలననైనను ఈ విధమైనది వదలిపోవుట అసాధ్యమని వారితో చెప్పెను" అని వున్నది. మార్కు 6 : 5 "కొద్దిమంది రోగులమీద చేతులుంచి వారిని స్వస్థపరచుట తప్ప మరి యే అద్భుతమును అక్కడ చేయజాలక పోయెను" అంటున్నది. ఈనాటి బోధకుడు ఎవరైన చెట్లు, పర్వతాలు మానవుల ఆజ్ఞలకు విధేయులై వుండాలని ఆజ్ఞాపిస్తే అతడిని పిచ్చివాడుగా పరిగణిస్తారు.]

ప్రార్థన, విశ్వాసం కలిస్తే ఏమైనా సాధించవచ్చు

మీరు ప్రార్థన చేయునప్పుడు వేటిని అడుగుదురో అవి (దొరికినవని) నమ్మినయెడల వాటి నన్నిటిని పొందుదురు. మత్త 21 : 22.

ప్రార్థన చేయునప్పుడు మీరు అడుగుచున్న వాటినెల్లను పొందియున్నామని నమ్ముడి; అప్పుడు అవి మీకు కలుగునని మీతో చెప్పుచున్నాను.
మార్కు 11 : 24.

మీరు నా నామమున దేని నడుగుదురో తండ్రి కుమారునియందు మహిమ పరచబడుటకై దానిని చేతును. నా నామమున మీరు నన్నేమి అడిగినను నేను చేతును. యోహా 14 : 13, 14.

(యోహా 15 : 7, 16 చూడండి)

[విశ్వాసం వలెనే ప్రార్థనకు గూడ శక్తి లేదని ప్రపంచానుభవం తెలియ జేస్తున్నది.]

ప్రార్థనవల్ల రోగాలు నయమవుతాయి

మీలో ఎవడైనను రోగియై యున్నాడా ? అతడు సంఘపు పెద్దలను పిలిపింపవలెను. వారు ప్రభువు నామమున అతనికి నూనె రాచి అతనికొరకు ప్రార్థన చేయవలెను. విశ్వాస సహితమైన ప్రార్థన ఆ రోగిని స్వస్థపరచును. ప్రభువు అతని లేపును. యాకో 5 : 14, 15.

[ప్రభువు వాగ్దానం లాగే అపొస్తలుల ఈ వాగ్దానం కూడ భంగమైంది.]

యేసుయందు నమ్మకముంచిన వారికి ఆకలి దప్పిక లుండవు !

అందుకు యేసు వారితో యిట్లనెను- జీవాహారము నేనే; నా యొద్దకు వచ్చువాడు ఏ మాత్రమును ఆకలిగొనడు, నా యందు విశ్వాసముంచువాడు ఎప్పుడును దప్పిగొనడు. యోహా 6 : 35.

[ ఈ వాగ్దానం ఎలా చూచినా భంగమైనట్లే. విశ్వాసులకు కూడ మానసిక బోధలతోపాటు ఆకలి దప్పుల బాధలున్నాయి. లేనట్లు నటించేవారిని మూర్ఖులనాలి. లూకా 4 : 2 స్వయంగా యేసే ఆకలిగొన్నట్లు చెబుతుండగా ఆయన యందు విశ్వాసముంచు వారికి ఆకలి దప్పులుండవని చెప్పడం అర్థం లేనిది.]

యేసును నమ్మిన వారికి మరణం లేదు

ఒకడు నా మాట గైకొనిన యెడల వాడెన్నడును మరణము పొందడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నానని ఉత్తర మిచ్చెను. యోహా 8 : 51.

[అంటే మరణించే వారందరూ విశ్వాసంలేని వారేనా ?]

క్రైస్తవులు నైతికంగా, మానసికంగా వికాసవంతులా ?

యేసు- నేను లోకమునకు వెలుగును, నన్ను వెంబడించువాడు చీకటిలో నడువక జీవపు వెలుగు గలిగియుండునని వారితో చెప్పెను.

యోహా 8 : 12.

[రోమను నాగరికత వల్ల లభించిన వికాసం క్రైస్తవం రాకతో నశించి, అజ్ఞానం మౌఢ్యంతో అంధయుగం ప్రవేశించింది.]

క్రైస్తవుల ఐక్యత

అప్పుడు మంద ఒక్కటియు గొఱ్ఱెల కాపరి ఒక్కడును అగును.

యోహా 10 : 16.

[తమలో తాము పోట్లాడుకుంటున్న క్రైస్తవ శాఖలు యేసును గొఱ్ఱెల కాపరిగా భావించి ఒక్క త్రాటి క్రిందికి రావడం ఎన్నటికీ జరుగని పని.]

మనుష్యకుమారుడు మహిమపొంది సాతానును త్రోసివేయును

మనుష్య కుమారుడు మహిమ పొందవలసిన గడియ వచ్చియున్నది .... ఇప్పుడు ఈ లోకమునకు తీర్పు జరుగుచున్నది. ఇప్పుడు ఈ లోకాధికారి బయటకు త్రోసివేయబడును. నేను భూమిమీదనుండి పైకెత్తబడిన యెడల అందరిని నా యొద్దకు ఆకర్షించుకొందునని చెప్పెను.

యోహా 12 : 23, 31, 32.

[క్రీస్తు భూమినుంచి పైకెత్తబడ్డాడు కాని ఎవరినీ ఉద్ధరించినట్లు లేదు. అధిక సంఖ్యాకులు అతని పేరు వినలేదు. ప్రపంచంపై తీర్పు, సాతాను త్రోసివేత జరగనేలేదు.]

పరిశుద్ధాత్మ విజ్ఞానం బోధిస్తుంది

తండ్రి నా నామమున పంపబోవు పరిశుద్ధాత్మ సమస్తమును మీకు బోధించును. యోహా 14 : 26.

సత్యస్వరూపియైన ఆత్మవచ్చినప్పుడు మిమ్మును సర్వసత్యములోనికి నడిపించును. యోహా 16 : 13.

[పరిశుద్ధాత్మ ఎంత విజ్ఞానాన్ని బోధించ గలిగిందీ అపొస్తలుల జ్ఞానాన్ని బట్టి తెలుస్తున్నది.]

కోడికూయక మునుపు నేను యేసును ఎరుగనని పేతురు మూడు సార్లు చెప్పాలి

యేసు అతని చూచి- ఈ రాత్రి కోడికూయక మునుపే నీవు ఎరుగనని ముమ్మారు చెప్పెదవని నీతో నిశ్చయముగా చెప్పుచున్నాననెను.

మత్త 26 : 34

ఆయన- పేతురూ నీవు నన్నెరుగనని ముమ్మారు చెప్పువరకు, నేడు కోడి కూయదని నీతో చెప్పుచున్నాననెను. లూకా 22 : 34.

[మార్కు 14 : 68-72 ప్రకారం పేతురు మొదటిసారి ఎరుగునని చెప్పగానే కోడి కూసింది.)

యేసు రెండవ యోనా లాగ మూడు రాత్రింబగళ్ళు సమాధిలో గడపాలి

వ్యభిచారులైన చెడ్డతరము వారు సూచక క్రియను అడుగుచున్నారు. ప్రవక్తయైన యోనాను గూర్చిన సూచక క్రియయే గాని మరియే సూచక క్రియ యైనను వారికి అనుగ్రహింపబడదు. యోనా మూడు రాత్రింబగళ్ళు తిమింగలము కడుపులో యేలాగుండెనో ఆలాగు మనుష్య కుమారుడు మూడు రాత్రింబగళ్ళు భూగర్భములో ఉండును. మత 12 : 39, 40.

యోనా నీనెవె పట్టణస్థులకు ఏలాగు సూచనగా ఉండెనో ఆలాగే మనుష్య కుమారుడును ఈ తరము వారికి సూచనగా ఉండును. లూకా 11 : 30.

మనుష్య కుమారుడు అనేక హింసలు పొంది .... చంపబడి, మూడు దినములైన తరువాత లేచుట అగత్యమని ఆయన వారికి బోధింప నారంభించెను.

మార్కు 8 : 31.

[క్రీస్తు మరల లేవలేదు. తన పునరుత్థాన సూచన ప్రపంచానికి చేయలేదు. అతడు మూడు పగళ్ళు, మూడు రాత్రుళ్ళు భూగర్భంలో వుండలేదు, శుక్రవారం సాయంత్రం పూడ్చిపెట్టబడి ఆదివారం ఉదయానికి పూర్వమే లేచాడు. అతను సమాధిలో ఒక పగలు, రెండు రాత్రులకు కొంచెం తక్కువ కాలం మాత్రమే వున్నాడు.]

## యేసు సూచక క్రియలు అనుగ్రహించలేదు

ఆయన ఆత్మయందు పెద్ద నిట్టూర్పు విడిచి- ఈ తరమువారు ఎందుకు సూచక క్రియ నడుగుచున్నారు ? ఈ తరమునకు ఏ సూచక క్రియయు ననుగ్రహింపబడదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని చెప్పి వారిని విడిచి.... పోయెను. మార్కు 8 : 12, 13.

[అపొ 2 : 22 "దేవుడు నజరేయుడగు యేసుచేత అద్భుతములను మహత్కార్యములను సూచక క్రియలను మీ మధ్యను చేయించి .... మీకు కనుపరచెదను" అని చెబుతున్నది.]

## తరం గడవకముందే తిరిగి వస్తానన్న క్రీస్తు

ఆయన ఒలీవ కొండమీద కూర్చుండియున్నప్పుడు శిష్యులాయన యొద్దకు ఏకాంతముగా వచ్చి- ఇవి ఎప్పుడు జరుగును ? నీ రాకడకును ఈ యుగ సమాప్తికిని సూచనలేవి ? మాతో చెప్పుమనగా యేసు వారితో ఇట్లనెను .... మెరుపు తూర్పున పుట్టి పడమటి వరకు ఏలాగు కనబడునో అలాగే మనుష్యకుమారుని రాకడయు నుండును .... ఆ దినముల శ్రమ ముగిసిన వెంటనే చీకటి సూర్యుని కమ్మును, చంద్రుడు కాంతిని యివ్వడు, ఆకాశమునుండి నక్షత్రములు రాలును, ఆకాశమందలి శక్తులు కదిలింపబడును. అప్పుడు మనుష్య కుమారుని సూచన ఆకాశమందు కనబడును. అప్పుడు మనుష్య కుమారుడు ప్రభావముతోను మహిమతోను ఆకాశ మేఘారూఢుడై వచ్చుట చూచి, భూమిమీద నున్న సకల గోత్రముల వారు రొమ్ముకొట్టుకొందురు. మరియు ఆయన గొప్ప బూరతో తన దూతలను పంపును. వారు ఆకాశము యొక్క ఈ చివర నుండి ఆ చివర వరకు నలుదిక్కులనుండి ఆయన ఏర్పరచుకొనిన వారిని పోగుచేతురు .... ఇవన్నియు

జరుగువరకు ఈ తరము గతింపదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ఆకాశమును భూమియు గతించునుగాని నా మాటలు ఏ మాత్రమును గతింపవు. మత్త 24 : 3, 4, 27, 29-31, 34,35. ఆకాశమునుండి నక్షత్రములు రాలును, ఆకాశమందలి శక్తులు కదిలింప బడును, అప్పుడు మనుష్య కుమారుడు మహా ప్రభావముతోను మహిమతోను మేఘారూఢుడై వచ్చుట చూచెదరు. అప్పుడాయన తన దూతలను పంపి, భూమ్యంతము మొదలుకొని ఆకాశాంతము వరకు నలు దిక్కులనుండి తాను ఏర్పరచుకొనిన వారిని పోగుచేయించును .... ఇవన్నియు జరుగు వరకు ఈ తరము గతింపదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను.

మార్కు 13 ; 25-30.

[ఈ వాగ్దానంలో కాలం ముఖ్యం సుమారు 2,000 సంవత్సరాలు గడచి పోయాయి. నజరేయుడైన యేసు వంశకుడుగా శిక్షింపబడ్డాడు. ఆ రోజుల్లో జనాన్ని భయపెట్టడానికి అది ఉపయోగించి ఉండవచ్చు. పెద్ద అబద్ధంగా అది మనముందున్నది. తూర్పునుండి పడమరకు మెరుపు కాంతిలో దైవకుమారుడు రాలేదు. ఆకాశ మేఘాల గుండా ఆయన రావడం ఎవరూ చూడలేదు. వాద్యాలతో అతని దూతలు ముందుగా రాలేదు. ఆకాశ నక్షత్రాలు రాలలేదు. అవింకా అక్కడే వున్నాయి. నక్షత్రరాసులు మొబు కాలానికి ఈనాటికి పెద్ద తేడా చూపడం లేదు.]

## తీర్పుదినం దగ్గరలోనే వుందని క్రీస్తు చెప్పాడు

ఒక కాలము వచ్చుచున్నది. ఆ కాలమున సమాధులలో నున్న వారందరు ఆయన శబ్దము విని మేలు చేసినవారు జీవపునరుత్థానమునకును కీడు చేసినవారు తీర్పు పునరుత్థానమునకును బయటికి వచ్చెదరు. యోహా 5 : 28, 29

మనుష్యకుమారుడు తన తండ్రి మహిమ గలవాడై తన దూతలతో కూడ రాబోవు చున్నాడు. అప్పుడాయన ఎవని క్రియల చొప్పున వానికి ఫలమిచ్చును. ఇక్కడ నిలిచి యున్నవారిలో కొందరు, మనుష్య కుమారుడు తన రాజ్యముతో వచ్చుట చూచువరకు మరణము రుచి చూడరని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాననెను. మత్త 16 ; 27, 28.

యేసు- నేను వచ్చువరకు అతడుండుట నాకిష్టమైతే నీకేమి?
యోహా 21 : 22.

(మార్కు 9 : 1; లూకా 9 : 27 కూడ చూడండి)

[ఇది కూడ ఆనాటి తరంలోనే జరిగి వుండాల్సింది. ఇది నిజంగా క్రీస్తు మాట్లాడి వుంటే అతను తప్పుడు ప్రవక్త కావాలి. అలాకాక సువార్తలలోకి ఆ అబద్ధాలు ఎక్కివుంటే సువార్తలన్నీ అబద్ధాలు కావాలి. ఎలాచూచినా క్రైస్తవం అబద్ధం మీద ఆధారపడి వుంది.]

## నాటి క్రైస్తవులు ఆకాశ మేఘాలల్లో ప్రయాణిస్తారు

మేము ప్రభువు మాటను బట్టి మీతో చెప్పునదేమనగా, ప్రభువ రాకడ వరకు సజీవులమై నిలిచియుండు మనము నిద్రించినవారికంటె ముందుగా ఆయన సన్నిధి చేరము. ఆర్భాటముతోను, ప్రధాన దూత శబ్దముతోను, దేవుని బూరతోను పరలోకము నుండి ప్రభువు దిగి వచ్చును; క్రీస్తు నందుండి మృతులైనవారు మొదట లేతురు. ఆ మీదట సజీవులమై నిలిచియుండు మనము వారితోకూడ ఏకముగా ప్రభువును ఎదుర్కొనుటకు ఆకాశ మండలమునకు మేఘములమీద కొనిపోబడుదుము. కాగా మనము సదాకాలము ప్రభువుతో కూడ ఉందుము. కాబట్టి మీరు ఈ మాటలచేత ఒకనినొకడు ఆదరించుకొనుడి.
1 థెస్స 4 : 15-18

[ఈ భ్రమకు పౌలు లోనయ్యాడు. బొందితో కైలాసానికి పోవాలని వాంఛించాడు. అలా అయితే మరణం తప్పుతుందని అతని ఆశ.]

## ప్రపంచాంతం గురించి పౌలు వచనాలు

ఆ దినముల అంతమందు .... మనతో మాటలాడెను. హెబ్రీ 1 : 2

కాలము సంకుచితమై యున్నది. 1 కొరిం 7 : 29.

ఆయన యుగయుగముల సమాప్తియందు తన్నుతానే బలిగా అర్పించు కొనుట వలన పాప నివారణ చేయుటకై యొక్కసారే ప్రత్యక్ష పరచబడెను.
హెబ్రీ 9 : 26.

ఇక కాలము బహుకొంచెముగా వున్నది, వచ్చుచున్నవాడు ఆలస్యము చేయక వచ్చును. హెబ్రీ 10 : 37.

సాక్ష్యమిచ్చిన క్రీస్తు యేసు యెదుట....మన ప్రభువైన యేసుక్రీస్తు ప్రత్యక్షమగు వరకు నీవు నిష్కళంకముగాను అనింద్యముగాను ఈ ఆజ్ఞను గైకొనవలెనని నీకు ఆజ్ఞాపించుచున్నాను. 1 తిమో 6 : 13, 14.

[దీన్నిబట్టి క్రీస్తు రాకడ, ప్రపంచం పోకడ రెండూ ఒకదానికొకటి అతి దగ్గరలో వున్నవని పౌలు బోధించినట్లు తెలుస్తుంది.]

అగ్నిద్వారా ప్రపంచాంతం జరుగుతుందని చెప్పిన పేతురు

అయితే అన్నిటి అంతము సమీపమై యున్నది. 1 పేతు 4 : 7.

సజీవులకును మృతులకును తీర్పు తీర్చుటకు సిద్ధముగా ఉన్నవానికి వారుత్తరవాదులై యున్నారు. 1 పేతు 4 : 5.

ఇప్పుడున్న ఆకాశమును భూమియు భక్తిహీనుల తీర్పును నాశనమును జరుగుదినము వరకు అగ్నికొరకు నిలువ చేయబడినవై, అదే వాక్యము వలన భద్రము చేయబడి యున్నవి .... ప్రభువు దినము దొంగ వచ్చినట్లు వచ్చును. ఆ దినమున ఆకాశములు మహాధ్వనితో గతించిపోవును, పంచభూతములు మిక్కుటమైన వేండ్రముతో లయమైపోవును .... ఆకాశములు రవులుకొని లయమైపోవునట్టియు, పంచభూతములు మహావేండ్రముతో కరిగిపోవునట్టియు, దేవుని దినపు రాకడకొరకు కనిపెట్టుచు, దానిని ఆశతో అపేక్షించుచు మీరు పరిశుద్ధమైన ప్రవర్తనతోను భక్తితోను ఎంతో జాగ్రత్త గలవారై యుండవలెను. అయినను మనమాయన వాగ్దానమును బట్టి క్రొత్త ఆకాశముల కొరకును క్రొత్త భూమి కొరకును కనిపెట్టుచున్నాము. వాటియందు నీతి నివసించును. ప్రియులారా వీటి కొరకు మీరు కనిపెట్టువారు గనుక శాంతముగలవారై ఆయన దృష్టికి నిష్కళంకులుగాను, నిందారహితులుగాను కనబడునట్లు జాగ్రత్త పడుడి.

2 పేతు 3 : 7, 10, 12-14.

కడవరి కాలముల యందు ఆయన ప్రత్యక్ష పరచబడెను.

1 పేతు 1 : 20.

(ఆపొ 2 : 16, 17 చూడండి)

[ప్రపంచాంతం జరుగుతుందనే విషయంలో పౌలుతో పేతురు ఏకీభ
వించాడు. వారిద్దరి మధ్య ఎన్ని తగాదాలున్నా ఈ విషయంలో మాత్రం
రాజీపడారు.]

## క్రీస్తు త్వరలోనే రాబోతున్నట్లు యాకోబు కూడ అన్నాడు

సహోదరులారా, ప్రభువు రాకడ వరకు ఓపిక కలిగియుండుడి ....
ప్రభువు రాక సమీపించుచున్నది .... న్యాయాధిపతి వాకిట నిలిచియున్నాడు.
యాకో 5 : 79

[యేసు ప్రభువు త్వరలో రాబోవుతున్నాడని తీర్పు మహాదినం దగ్గర
పడుతున్నదని ఆదిమ క్రైస్తవులను మోసంచేసిన వారిలో యాకోబుకూడ
వున్నాడు.]

## దొంగకు రక్షణ వాగ్దానం చేసిన యేసు

అందుకాయన వానితో- నేడు నీవు నాతోకూడ పరదైసులో ఉందువని
నిశ్చయముగా నీతో చెప్పుచున్నాననెను. లూకా 23 : 43.

[సిలువ వేయబడిన రోజున క్రీస్తు పరదైసుకు వెళ్ళలేదు. ఎందుకంటె
క్రైస్తవుల ప్రకారం యేసు మూడు రాత్రులు, మూడు పగళ్ళు సమాధిలో
వుండాలి. అలా జరగలేదను కున్నా అదేరోజున దొంగకు రక్షణ
కల్పిస్తానన్న వాగ్దానం భంగం అయినట్లే. యోహా 20 : 17 లో
పునరుత్థానం తరువాత కూడ ఇంకా తండ్రియొద్దకు ఎక్కిపోలేదని
స్వయంగా యేసే చెప్పాడు.]

## నమ్మిక సూచనలు

నమ్మినవారి వలన ఈ సూచక క్రియలు కనబడును. ఏవనగా నా నామమున
దయ్యములను వెళ్ళగొట్టుదురు; క్రొత్త భాషలు మాటలాడుదురు. పాములను ఎత్తి
పట్టుకొందురు, మరణకరమైనదేది త్రాగినను అది వారికి హాని చేయదు, రోగుల
మీద చేతులుంచినపుడు వారు స్వస్థత నొందుదురని వారితో చెప్పెను.
మార్కు 16 : 17, 18.

[ఈ సూచనలు విశ్వాసాన్ని అనుసరించడం లేదు. ఆచరణలో పెట్టినప్పుడు క్రీస్తు వాగ్దానాలు విఫలమవుతున్నాయి. బ్రతికిన వాడెవడూ విశ్వాసంతో దయ్యాలను (?) వదిలించుకోవడం గాని, విషం త్రాగి చావు తప్పించుకోవటంగాని జరగటం లేదు. అంటే యిప్పుడు విశ్వాసం నశించిందని అర్థమా ?]

## క్రీస్తు త్వరలో వచ్చి అందరికీ కపినిస్తాడు.

ఇదిగో ఆయన మేఘరూఢుడై వచ్చుచున్నాడు; ప్రతి నేత్రము ఆయనను చూచును, ఆయనను పొడిచిన వారును చూచెదరు; భూజనులందరు ఆయనను చూచి రొమ్ముకొట్టుకొందురు; అవును ఆమేన్. ప్రక 1 : 7

నేను త్వరగా వచ్చుచున్నాను. ప్రక 3 : 11.

[త్వరలో అంటే 2,000 సంవత్సరాలని అర్థం అన్నమాట. ఇంకా ఎక్కువ కాలమని చెబితే అది ఎంతో ఆ మూఢ విశ్వాసులే వివరించాలి. ప్రభువు దృష్టిలో వెయ్యి సంవత్సరాలు ఒక రోజని, ఒకరోజు వెయ్యి సంవత్సరాలని క్రైస్తవుల వాదం. కాని ప్రభువు ఈ మాటలు చెబుతున్నది మామూలు మనుషులతో. వారి దృష్టిలో ఒక పైసా వెయ్యిరూపాయలతో సమానమైతే ఒకరోజు వెయ్యి సంవత్సరాలతో సమాన మవుతుంది. ఒక రోజులో డబ్బిస్తానని చెప్పి వెయ్యి సంవత్సరాలదాకా వాయిదా వేస్తూ వుండేవాడిని ప్రజలు అసత్యవాది అంటారు. కాని క్రైస్తవుల దేవుడు మానవ నీతి సూత్రాలకుఅతీతుడు.]

## వెయ్యి సంవత్సరాలు బందీగా సాతాను

అతడు ఆదిసర్పమును, అనగా అపవాదియు సాతానును అను ఆ ఘట సర్పమును పట్టుకొని వెయ్యి సంవత్సరములు వానిని బంధించి అగాధములో పడవేసి ఆ వెయ్యి సంవత్సరములు గడచువరకు ఇక జనములను మోసపరచకుండునట్లు అగాధమును మూసి దానికి ముద్రవేసెను. ప్రక 20 : 2, 3.

వారు బ్రదికినవారై, వెయ్యి సంవత్సరములు క్రీస్తుతో కూడ రాజ్యము చేసిరి. ఆ వెయ్యి సంవత్సరములు గడచు వరకు కడమ మృతులు బ్రదుకలేదు. ఇదియే మొదటి పునరుత్థానము. ప్రక 20 : 4, 5.

[పై సూత్రం ప్రకారం సాతాను వెయ్యి సంవత్సరాలు బందీగా వున్నాడంటే 24 గంటలే అని అర్థం చేసుకోవచ్చు?]

అంత్యదినం, మృతుల పునరుత్థానం, పాపులకు శిక్ష, సముద్రం లేకుండా ఆకాశము, భూమి!

మరియు ధవళమైన మహాసింహాసనమును దానియందు ఆసీనుడైయున్న యొకనిని చూచితిని; భూమ్యాకాశములు ఆయన సముఖము నుండి పారిపోయెను; వాటికి నిలువ చోటు కనబడక పోయెను ... సముద్రము తనలో వున్న మృతులను అప్పగించెను. మరణమును పాతాళ లోకమును వాటి వశమున నున్న మృతుల నప్పగించెను. వారిలో ప్రతివాడు తన క్రియల చొప్పున తీర్పుపొందెను. మరణమును మృతుల లోకమును అగ్నిగుండములో పడవేయబడెను. ఈ అగ్ని గుండము రెండవ మరణము. ఎవని పేరైనను జీవగ్రంథమందు వ్రాయబడినట్టు కనబడని యెడల వాడు అగ్నిగుండములో పడవేయబడెను. ప్రక 20 : 11-15

అంతట నేను క్రొత్త ఆకాశమును క్రొత్తభూమిని చూచితిని. మొదటి ఆకాశమును మొదటి భూమియు గతించి పోయెను. సముద్రమును ఇకను లేదు.

ప్రక 21 : 1.

దగ్గరలో తీర్పుదినం

మరియు ఆ దూత ఈలాగు నాతో చెప్పెను- ఈ మాటలు నమ్మకములును సత్యములునై యున్నవి. ప్రవక్తల ఆత్మలకు దేవుడగు ప్రభువు, త్వరలో సంభవింప వలసిన వాటిని తన దాసులకు చూచుటకై తన దూతను పంపెను .... మరియు అతడు నాతో ఈలాగు చెప్పెను- ఈ గ్రంథమందున్న ప్రవచన వాక్యములకు ముద్రవేయవలదు; కాలము సమీపమైయున్నది .... ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వాని వాని క్రియ చొప్పున ప్రతివాని కిచ్చుటకు నేను సిద్ధపరచిన జీతము నా యొద్ద ఉన్నది .... ఈ సంగతులను గూర్చి సాక్ష్యమిచ్చువాడు- అవును, త్వరగా వచ్చుచున్నానని చెప్పుచున్నాడు. ఆమేన్.

ప్రక 22 : 6, 10, 12, 20.

[కొద్దికాలంలో జరగవలసివున్న జోస్యాలు (ప్రక 1 : 1) 20 వ శతాబ్దం అయిపోవస్తున్నా ఏమీ జరగలేదు. సాతాను బంధించబడలేదు. మొదటి పునరుత్థానము కాని రెండవ పునరుత్థానము కాని జరగలేదు.]

## బైబిలుకు మార్పులు, చేర్పులు చేసేవారికి కఠిన శిక్షలు

ఈ గ్రంథమందున్న ప్రవచన వాక్యములను విను ప్రతివానికి నేను సాక్ష్యమిచ్చునది ఏమనగా- ఎవడైనను వీటితో మరి ఏదైనను కలిపిన యెడల, ఈ గ్రంథములో వ్రాయబడిన తెగుళ్ళు దేవుడు వానికి కలుగజేయును; ఎవడైనను ఈ ప్రవచన గ్రంథమందున్న వాక్యములలో ఏదైన తీసివేసినయెడల, దేవుడు ఈ గ్రంథములో వ్రాయబడిన జీవ వృక్షములోను పరిశుద్ధ పట్టణములోను వానికి పాలులేకుండ చేయును. ప్రక 22 : 18, 19.

[కేథలిక్ బైబిలుకు ప్రొటెస్టెంట్ల బైబిలుకు చాల తేడా వున్నది. ఈ పుస్తకం వ్రాయడానికి ఆధారంగా తీసుకున్న ప్రొటెస్టెంట్ల బైబిలు కూడ ఏ రెండు అనువాదాలు తీసుకున్నా ఒక్కలాగే వుండవు. కొన్ని అనువాదాల్లో తీసివేతలు కొన్ని అనువాదాల్లో చేర్పులూ జరుగుతూనే వున్నాయి. కొన్ని ఉదాహరణలు ఈ పుస్తకంలోనే గమనించారుకదా ! మరి ఆయా అనువాదకులు, ముద్రణకర్తలు, ఆయా గ్రంథాలను చదివి అదే నిజమని భావించే క్రైస్తవ విశ్వాసులు పై శిక్షలు అనుభవిస్తున్నారా ?- అను.]

BYBILUDARSINI - APASRUTULU Price : 4/-

# బైబిలు దర్శిని

అనువాదం :

## పెన్మెత్స సుబ్బరాజు

| | | | |
|---|---|---|---|
| 1) | అసంబద్ధాలు | .... | రు. 4/ |
| 2) | అసంభావ్యాలు | .... | 4/ |
| 3) | అత్యాచారాలు | .... | 4/ |
| 4) | అశ్లీలాలు | .... | 4/ |
| 5) | అపశ్రుతులు | .... | 4/ |

'సైన్సు - మతం' గురించి రావిపూడి వెంకటాద్రి రచనలు

| | | |
|---|---|---|
| విశ్వాన్వేషణ | .... | రు. 5/- |
| జీవమంటే ఏమిటి ? | .... | 5/- |
| విశ్వతత్వం | .... | 12/- |
| ఐన్‌స్టీన్ : మతం-దైవం | .... | 3/- |
| శాస్త్రం - పురాణం | .... | 2/- |
| ఇస్లాం - ఒక అంచనా | .... | 1/- |
| శంకరాచార్యుడి హత్య | .... | 2/- |
| చార్వాకుల కథలు | .... | 6/- |
| జ్యోతిషం శాస్త్రమా ? | .... | 2-50 |
| శాస్త్రం - మతం | .... | రెండవ ముద్రణలో |

ప్రతులకు :

రావిపూడి వెంకటాద్రి

ఎడిటర్, హేతువాది : : చీరాల-523 155